ముప్పది యెనిమిదివ పూజాపుష్పము

# శ్రీ భగవద్గీత

## పదునెనిమిది అధ్యాయములు

(గీతికలలో)







కూర్పు :

పి. దుర్గారావు, యం. ఓ. యల్.

ప్రథమ ముద్రణము : 400 ప్రతులు


ఈశ్వరనామ సంవత్సరం
వర్షఋతువు - శ్రావణ మాసము
1997-ఆగష్టు నెల

వెల : రూ. 18-00

ముద్రణ :
డి. బి. ప్రింటర్స్
విజయవాడ-2



---

ప్రతులకు : 1) పి. దుర్గారావు యం.ఓ.యల్.
అడవిదేవులపల్లి పోస్టు, 508207
(వయా) మిర్యాలగూడ, నల్లగొండ జిల్లా.

2) విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
బ్యాంకు స్ట్రీట్, హైదరాబాద్.
(అన్ని బ్రాంచీలలో లభ్యమగును)

3) నవయుగ బుక్ డిస్ట్రిబ్యూటర్స్,
సుల్తాన్ బజార్, హైదరాబాద్.



# సమర్పణ

ఓం కృష్ణం కమల పత్రాక్షం
పుణ్య శ్రవణ కీర్తనమ్।
వాసుదేవం జగన్నాథం
నౌమి నారాయణం హరిమ్।




వ్యాసాయ విష్ణురూపాయ
వ్యాసరూపాయ విష్ణవే।
నమోవై బ్రహ్మనిధయే
వాసిష్ఠాయ నమోనమః॥

నమోస్తుతే వ్యాస విశాల బుద్దే
పుల్లార విందాయత పత్రనేత్ర।
యేనత్వయా భారత తైలపూర్ణ
ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః॥

భారతామృత సర్వస్వం
విష్ణోర్వక్త్రాద్వినిస్సృతమ్।
గీతా గంగోదకం పీత్వా
పునర్జన్మ న విద్యతే।

పుష్పాంజలులతో

# గీతాంజలి

పరమాత్ముండగు శ్రీకృష్ణునిచే
ఎన్నుగ నాటగ బడినదియున్

వేదవ్యాసునిచేత పెంపబడి
విమల వేదములు బీజముగా

గలదియు ప్రబోధమను నంకురమును
అలి భాసిల్లుచు నుండునదియున్

సకల శాస్త్రముల రహస్యంబు లను
శాఖలు గలిగీ యున్నదియున్

అనాసక్తి, క్షమ యను చిగుళ్ళతో
నతి శోభాయుతమైనదియున్

శ్రీ గోవిందుని పాదపద్మముల
స్థిరమగు భక్తి సుగంధములన్

శోభలచే శోభిల్లుచు నంతట
సురుచిర మోక్షము జ్ఞానులకున్

ప్రసాదించు గీతా కల్పంబును
ఎన్నుగ భజియించుదు నెపుడున్



# వినయ వాక్యము

శ్రీ భగవద్గీత శ్రీకృష్ణ పరమాత్మునిచే కౌరవ పాండవ సంగ్రామ సమయమున అర్జున దేవున కుపదేశింపబడినది.

వేద వ్యాసునిచే సంస్కృత భాష యందు రచింపబడిన మహాభారత మందు భీష్మపర్వమున యీ గీత గలదు. పదునెనిమిది అధ్యాయములలో 701 శ్లోకములతో విరాజిల్లుచున్నది.

అర్జునుడు కౌరవ పాండవ సంగ్రామమునందు తండ్రులను, తాత లను, గురువులను సంగ్రామమున జంపజాలనని భీష్మించును. అట్టి సమయమున యీ గీతను శ్రీకృష్ణుడు అర్జునున కుపదేశించును. అర్జునుడు అడిగిన ప్రశ్నలకు శ్రీకృష్ణుడు సమాధానమిచ్చును. ఈ సమాధానములే భగవద్గీతగా ప్రసిద్ధి నొందినది.

వేదవ్యాసుని కృపచే సంజయుడు ఎవరికిని కనపడకుండగా యుద్ధ రంగమున జరిగిన విషయములు వార్తాహరునివలె వర్ణించి అంధుడైన ధృతరాష్ట్ర భూవిభునకు వినిపించును. సంగ్రామ వార్తలతోబాటు యీ గీతనుగూడ వినిపించును.

శ్రీ భగవద్గీత సకల ఉపనిషత్తులకు సారంశంగా ప్రసిద్ధి చెందినది. ప్రపంచమున సకల భాషలలో అనువదింపబడి ప్రచురింపబడినది. మహా పురుషులందరు ప్రశంసించిరి. తిలక్, మహాత్మాగాంధీజీలు గీతను అనువ దించి వ్యాఖ్యానించిరి.

గీతా గ్రంథమందు ఆత్మ పరమాత్మల తత్త్వమును, పరమాత్మను దర్శించు మార్గములు, భక్తి జ్ఞాన వైరాగ్యములు వివరింపబడినవి. పర మోత్తమమైన జీవన మార్గములను, మానవ ధర్మములు ఉపదేశింపబడినవి. వేదసార మంతయు ఇందు వ్యక్తీకరింపబడినదని పెద్దలు వచింతురు.

# ప్రేరణ

నా చిన్నతనమందు గాంధీజీ వ్యాఖ్యానించిన గీతా గ్రంథమును శ్రీ ఎర్నేని సుబ్రహ్మణ్యంగారు అనే గాంధేయవాది తెలుగులో వచన రూపమున అనువదించిరి. ఆ గ్రంథమును ఎన్నిసారులు చదివితినో నాకే తెలియదు. కాళహస్తి శుక బ్రహ్మాశ్రమమువారు ప్రచురించిన గీతా గ్రంథం గూడ ఎన్నోసార్లు జదివితిని.

ప్రస్తుతము తెలుగుభాషా బోధకుడనగుటచేతను, పెద్దల సేవ జేయుటచేతను స్వల్పమైన కవితా లక్షములు యేర్పడుటచే కృష్ణభక్తితో కూడిన మధుర గీతములు అనేకము రచించి ప్రచురించితిని.

చిన్ననాడు ఆసక్తి గలుగజేసిన గీతనుగూడ గీతికలలో రచింప వలెనని భావించి, యీ సాహసమునకు పూనుకొంటిని.

నేను సామాన్యుడను. శ్రీ భగవద్గీతవంటి మహోన్నత గ్రంథమును గీతికా రూపమున వ్రాయుటకు సమర్థుడనుగాను. గీతయందు నాకు గల భక్తిచేత యీ మహత్కార్యమునకు బూనుకొంటిని. తేలిక భాషలో, గీతికా రూపమున సామాన్యులుకూడ పాడుకొనవలెనను ఉద్దేశముతో చతురస్ర గీతులలో 701 దరణములలో రచించితిని. ముఖ్యముగా విద్యార్థులను దృష్టిలో చుంచుకొని వ్రాసితిని,

గ్రంథములో భాషయందును, భావ వ్యక్తీకరణయందును అనేక దోషము లుండవచ్చును. పెద్దలు నా యీ సాహసమును క్షమింపగలరు.

శ్రీ భగవద్గీతవంటి మహా గ్రంథమును గీతికా రూపమున రచించి ప్రచురించుట నా పరమ సుకృతమని భావించుకొనుచున్నాను. 400 ప్రతులు మాత్రమే ప్రచురింపబడినవి. విజ్ఞులు కార్డుద్వారా తెలిపినచో ద్వితీయ ముద్రణమున సరిజేసికొందును. ఇట్టి సత్కార్యమును నాతో జేయించినందులకు పరమేశ్వరునకు వందనములు.

వినయాంజలులతో

# విషయ సూచిక

| సంఖ్య | విషయము | పుట |
|---|---|---|

# గీతా మహాత్మ్యము

శ్రీ భగవంతుని విష్ణుదేవుని శ్రీ భగవతి భూదేవి యిటుల్
ప్రశ్నించెను ప్రశ్నార్థకంబుగా ప్రవిమల భక్తియు దొలుకాడన్!
ఓ భగవంతుడ! ఓ పరమేశ్వర! ఓ ప్రభు! దెలుపుము విశదముగా
ప్రారబ్ధం బనుభవించువానికి భవ్యమైన యీశ్వరభక్తి
ఎటుల గలుగ గలదో మఱి తెలుపుము నేవిధి నొందునో ముక్తి యిలన్? 1

అది విని విష్ణువు నా భూదేవికి నలరి యటుల నుపదేశించెన్!
ఓ భూదేవీ! వినుమా! దెలిపెద! యొప్పుగ నీ వడిగిన ప్రశ్నన్!
గీతాభ్యాసరతుండై నెపుడును గీర్తన సేయునో బరమేశున్!
అట్టివాడు ముక్తుండై కర్మల నంటబడక యీ లోకమునన్!
సదా సుఖముగా నుండును దేవీ! శాశ్వత బరమును సాధించున్! 2

నళినీ దళమును నీరంటని విధి నయముగ గీతాభ్యాసముననన్!
రతుడై యుండిన నరుని పాపములు రహి నంటవు దూరము నుండున్!
ఎచ్చట గీతా గ్రంథముండునో యెచట పఠింపగ బడుచుండున్
ప్రయాగాది తీర్థము లట నుండును భవ్య సర్వక్షేత్రములుండున్! 3-4

ఎట గీతా పారాయణ ముండునో యచటకు సమస్త దేవతలున్!
యోగులు, ఋషులును, బన్నగులును మఱి దగ గోపాలురు గోపికలున్
భగవంతుని పార్శ్వమున జరించెడి భక్తులు నారదు డుద్ధవుడున్!
వేగముగా నట కొచ్చి నిలిచెదరు దగు సహాయమును జేయంగన్! 5

ఓ భూదేవీ! గీతను గూర్చిన యొప్పుగ శ్రద్ధా బఠనంబున్!
విమల విచారణ, బోధన, శ్రవణము అమల భక్తి భావముతోడన్!
జరుగుచుండునో యట నే నుందును సంతసమును మది బొందుచునూ!
కరుణింతును! నా భక్తుల గాచెద కర్మబంధముల ద్రెంపుదునూ! 6

గీత నాశ్రయము జేసికొంటి నే గీతయె నా కుత్తమ గృహమున్!
గీతాజ్ఞానము నాశ్రయించియే కీరవాణి! బరిపాలింతున్!
మూడు లోకముల మునులను ఋషులను మోదముతో నా దేవతలన్!
సకల చరాచర కోటి నంతటిని సరసత గీతాజ్ఞానమునన్! 7

దేవి! సంశయ మింతలేదు! సుమ! దివ్యగీత నా విద్యసుమా!
పరమంబైనది బ్రహ్మ స్వరూపము బ్రవిమల సత్యంబైనదియున్!
ప్రణవము నార్ధవ పాదంబగు నా బన్నుగ యోంకారము నందున్!
అర్ధమాత్ర రూపమున నున్నదియు నలరి దెలుపగను రానిదియున్!
నిత్యంబైనది నిర్మలమైనది నిఖిల మంతయును నిండినదియున్! 8

చిదానందుడగు శ్రీకృష్ణునిచే శ్రీకరముగ యా ఫల్గుణుకున్!
స్వయముగ దెలిపెను భారతరణమున బ్రవిమలమగు గీతాబోధన్!
మూడువేదముల సారంబిది సుమ! మోదానంద స్వరూపంబున్!
తత్త్వజ్ఞానము గలుగజేయునది దరుగనిభక్తిని బఠియింపన్! 9

నిశ్చల మానసమున యా గీతను నిర్మలమతి యే మానవుడున్!
బదునెనిమిది యధ్యాయము లన్నిటి బన్నుగ నిత్యము బఠియించున్!
ఆ మానవుడును జ్ఞానసిద్ధినీ యలరును మఱి యా జ్ఞానముచే!
బరమ పదంబును నాతడు బొందును భవ్యమోక్షమును నత డొందున్! 10

గీతను సాంతము బదువలేని యా కీర్తిమంతులగు మానవులున్!
తదర్ధభాగము నైన బదువవలె తన్మయమై భక్తిని గూడీ!
గోదానము జేసిన బుణ్యంబును గూరిమి గలుగును నాతనికిన్
సందేహం చింతయు లేదుసుమా! సాధుమతీ! విను మీ పలుకుల్! 11

మూడవ భాగము బదువు వారికిని ముదమున గంగా స్నానంబున్!
జేసినవారికి ఫలము గలుగునో స్థిరముగ గలుగును వారికినీ!
ఆఱవ భాగము బఠించువారును నందగలుగుదురు ననుభక్తిన్
సోమయాగమును జేసిన ఫలమును శుభకరమగు స్థానంబు మఱిన్! 12

ఏకాధ్యాయంబును గీతను దగ యేమరకను మఱి నిత్యంబున్!
బఠించుచుండునో యా మానవుడును బరగ రుద్రలోకమును జనున్!
అచట రుద్ర గణములతో నొకడై యలరి వసించును నెల్లపుడున్!
ఆ పరమేశ్వరు నారాధించుచు నచట గడుపు నానందమునన్! 13

ఓ భూదేవీ! నొప్పుగ గీతను నొక యధ్యాయము నందుననూ!
నాల్గవ భాగము రోజు రోజునూ నయముగ బఠించునో యతడున్!
దివ్యమైన మానవ జన్మంబున దీప్తి తేజమున భాసించున్!
ఒక మన్వంతర కాలం బచటను నొప్పుగ జీవించును రక్తిన్! 14

గీతయందు బది శ్లోకములైనను సతతము నేడును నైదైనన్!
నాలుగయిన, మూడైన, రెండైన, నయముగ యొకటైనను గూడన్!
తదర్థ శ్లోకం బైనను గూడను దగ బఠించునో నాతండున్!
చంద్రలోకమును బొంది యచ్చటను సాంద్రభోగ సుఖముల నందున్! 15

సంశయ మింతయు లేదుసుమా! మఱి చక్కగ గీతను బఠించుచున్!
ఏ పురుషుడు మరణించునో నాతడు నివ్వసుధాస్థలి యందుననూ
ఉత్తమ మానవ జన్మంబును మఱి యుత్తమోత్తమమగు కీర్తియునూ
బడయగలుగు నత డో భూదేవీ! బన్నుగ పుణ్య ఫలంబుననూ! 16

ఆ విధముగ మానవుడై జనించియును మఱల మఱల గీతను జదివీ!
ఉత్తమమగు మోక్షంబును బొందును సుర్విజనులు గీర్తింపగనూ!
గీతా! గీతా! యనుచు బలుకుచును కీరమువలె బ్రాణము విడుచున్!
ఉత్తమలోకము నందు నతండును నున్నత గీత ప్రభావమునన్! 17

మహాపాప యుతుడైనను గూడను మహిమాన్విత గీతార్థంబున్!
ఆసక్తిని గలిగున్నచో నతడు నల వైకుంఠమునకు బోవున్
ఆనందంబును ననుభవించు మఱి యఖిలేశునితో గూడికొనీ!
జన్మపరంపర నుండి ముక్తుడై సర్వేశ్వరునిలో జేరుకొనున్! 18

ఎవ్వరు గీతార్థంబును సతతము నొవ్వక జింతనమును జేయున్
అనేక కర్మల నాచరించినను నాతడు జీవన్ముక్తు డగున్!
దేహాంతంబున పరమ పదంబును దివ్యలోకమునకును బోవున్!
భూభుజులగు జనకాదు లనేకులు బుణ్య గీత నాశ్రయమందీ!
పాపరహితులై పుణ్యమునందీ పరమపదము బొందిరి వారున్! 19-20

గీతా పఠనము జేసి మానవుడు గీతా మహాత్మ్య బఠనంబున్
బారాయణమును జేయకుండునో బన్నుగ గీతాబఠనంబున్!
వ్యర్థమగును నిష్ఫలమగు గావున శ్రద్ధను గీతా మహాత్మ్యమున్!
జదువగా వలయు సదమల భక్తిని సత్ఫలితంయిల నందగనూ! 21

సరసత యీ గీతా మహాత్మ్యమును చక్కని భక్తిని బఠించునో.
పైని జెప్పినా ఫలములనందును బరమగతిని నాతడు బొందున్ 22

మహాత్ముడగు నా సూతుడు దెలిపెను మహామునుల కిటు శాంతమునన్!
శౌనకాది మునులారా! వినుడో! సనాతనంబగు నట్టిదియున్!
గీతా మహాత్మ్యమును దెలిపితినీ గీతను జదివిన వెనువెంటన్
బఠించునో యాతడు బొందుని కన్ పైజెప్పిన సత్ఫలితములన్!

(గీతామహాత్మ్యము సమాప్తము)

ఓం

# శ్రీ భగవద్గీత

## అర్జున విషాదయోగము

## ఒకటవ అధ్యాయము

వ్యాసుని కృప వడసిన సంజయముతో వలనొప్పగ ధృతరాష్ట్రుండున్
సింహాసనమున గూర్చొని యతడును జిత్తము ఖేదము దొలుకాడన్!
భావిచరిత యెటు బరిణమించునో బన్నుగ కౌరవ పాండవులున్!
ఏమైపోవుదురో యటంచు మది యిలపై రాల్పుచు గన్నీరున్!

సంజయ దెలుపుము! సరగున వార్తలు సరసముగా విశదంబుగనూ!
పుణ్యభూమియగు గురుక్షేత్రమున పొలుపుగ నా వారలునైనా!
కౌరవులును మఱి పాండు కుమారులు గలని గూడికొని యాసక్తిన్!
ఏమి జేసిరో! యెటు వర్తించిరొ! నిరువుగ దెలుపుము బరమసఖా! 1

ధృతరాష్ట్రుని బలుకులకు సంజయుడు ధృత వేగంబున నిటు లనియెన్!
అంతట రాజగు దుర్యోధనుడును నట వ్యూహాకారముతోడన్!
నుండిన పాండవసేనను గాంచుచు బటు వేగంబున గురువైనా
ద్రోణాచార్యుని సమీపించి యిటు దోరముగా బలికెను నతడున్! 2

ఓ ఆచార్యా! ద్రోణాచార్యా! యొనరగ గాంచుము సైన్యంబున్!
దీమంతుండును, ద్రుపద పుత్రుడును దీరుడునగు దమ శిష్యుండున్!
ధృష్టద్యుమునిచే రచింపబడి దృఢముగ వ్యూహాకారముగా
పాండవసైన్య బదిగో గాంచుము! బ్రబలమైన యా వ్యూహమునూ! 3

పాండవసేనను గాంచుము గురువర! ప్రబల ధనుర్విద్యా నిపుణుల్!
అనిలో భీమార్జునులకు సములగు నంతట గల రెందఱొ వీరుల్!
యుయుధానుడు విరటుండు, శైబ్యుడును యోధుడునగు నాద్రుపదుండున్!
దృష్టకేతువును, జేకితానుడును ధృతిమంతుడు గాశీరాజున్! 4

పురుజిత్తుడు, కుంతీభోజుండును నరోత్తముండగు శైబ్యుడున్!
శౌర్యవంతుడగు యుధామన్యుడును సాహసుడగు నభిమన్యుండున్!
ఉత్తమౌజుడును, మఱి గురువర్యా! యుపపాండవులును గలరచటన్!
వీరందరునూ మహారథులు సుమ! వీరవిక్రములు రణధీరుల్! 6

ద్విజోత్తమా! విను మన సైన్యంబున ధీరులు సేనానాయకులున్!
ప్రముఖులెందఱో గలరు దెలిపెదను బన్నుగ వారల నందఱినీ!
సంజ్ఞార్థముగా దెలిపెద మీకును చక్కగ వారల బేరులనూ
మీకు దెలియు వారల విక్రమమును మిగులు శౌర్య వీరత్వములున్! 7

ఆచార్యులు, మీరును, భీష్ముండును, అశ్వత్థామయు, కర్ణుండున్;
జయశీలుండగు కృపాచార్యుడును సాహసుడగు భూరిశ్రవుడున్!
నాకొఱకై జీవితము ద్యజింపగ నయముగ నిలిచిరి ధీరవరుల్!
వివిధాస్త్రములను ధరించి రణమున వీరులు, శూరులు నిలిచిరటన్! 8-9

అట్టి శూరులును గల మన సైన్యము నల భీష్మునిచే రక్షితమున్!
అపరిమితంబై యొప్పుచునున్నది యజేయమై గనపడుచుండైన్!
ఆ సైన్యము భీమాభిరక్షితము నింపుగ నున్నది పరిమితమై
జయింపగను శక్యంబై యున్నది జయము నిశ్చయము మన కింకన్! 10

మీరందఱు మీ వ్యూహాంపథముల మీ మీ నియమిత స్థానములన్!
నిలిచి యుద్ధమును జేయగ నలయును నిఖిలము బరిశీలించుచునూ!
సర్వవిధములను భీష్ముని గావగ తఱచి చూచు చుండగ వలయున్!
అతడేగద యీ సేనకంతటికిని మధిపతి సేనానాయకుడున్! 11

అంతట గురు వృద్ధుడును ప్రతాపుడు నలరుచు భీష్మ పితామహుడున్!
సుయోధనున కుత్సాహము గలుగగ సురుచిరముగ సింహధ్వనితోన్!
శంఖంబును బూరించె నంతటను సాంద్రధ్వనితో దీర్ఘముగన్!
దిక్కులన్నియును ప్రతిధ్వనించెను దిశలన్నియునూ మార్మోగెన్! 12

అటుపిమ్మట నా కౌరవసైన్యము నలరిజేసె శంఖధ్వనులున్!
భేరీలను దప్పెటల తోడుతను భీకరంబులగు నాదములన్!
యుద్ధరంగమున తుముల శబ్దములు నుద్ధృతముగ మ్రోగించి రటన్!
ఆ శబ్దంబులచే మార్మోగెను నల దశదిశలును ఘోరముగా! 13

అటు పిమ్మట తెల్లని గుఱ్ఱములను నలరిన రథమున గూర్చొనియున్!
కృష్ణార్జును లిరువురును గూడ దమ గూరిమినూదిరి శంఖములన్! 14

పాంచజన్యమును శ్రీకృష్ణుండును బన్నుగ ధనంజయుడు నంతన్!
దేవదత్తమును బూరించెనుగా దివి భువి మార్మోగగ ధ్వనులున్!
భీమ కర్ముడగు వృకోదరుండును భీతిల పౌండ్రంబను శంఖున్!
కుంతీసుతుడగు ధర్మరాజు మఱి యనంత విజయం బను శంఖున్! 15-18

నకులుడు సుఘోషమను శంఖంబును నయముగ సహదేవుడు నంతన్!
మణిపుష్పకమను శంఖంబులనూ మానుగ నూదిరి బిగ్గఱగన్!
ఆ విధముగనే కాశీరాజును నల మహారథుడు శిఖండియున్!
అల దృష్టద్యుమ్నుండు విరటుడును నపజయ మెఱుగని సాత్యకియున్!
ద్రుపదుండును మఱి ద్రౌపది తనయులు నుపపాండవు లభిమన్యుండున్!
సేనయంతయును వేఱువేఱుగా స్థిరముగ నూదిరి శంఖములన్!
పాండవ వీరుల శంఖధ్వనులును బన్నుగ భూమ్యాకాశములన్!
దద్దరిల్ల జేయుచు గౌరవ్యుల బ్రద్దలు జేసెను గుండియలన్! 19

మహారాజ! ధృతరాష్ట్ర విభూ! మానుగ నా జెప్పెడి పలుకుల్!
అటుపిమ్మట నా రణరంగంబున యాయుధములు యెత్తగ నుండన్!
కపిధ్వజుండగు అర్జును దంతట గాంచె కౌరవుల గనులారన్!

శస్త్రధరులునగు వారల గాంచీ, యస్త్రంబును జే ధరియించీ!
హృషీకేశుతో నీ విధి బలికెను హృదయము సంచనం బొందన్! 20

అర్జుడు డిట్టుల బలికె కృష్ణుతో నాసక్తిని గనబఱచుచునూ!
అచ్యుత! యుద్ధారంభమునందున యలరి పోరు నెవ్వరితోడన్
సలుపగ వలయునో! యట్టివీరులను జక్కగ చూడగ గలుగుదునో!
అట్టిచోట నారధమును నిలుపుము నలరి రెండు సేనల మధ్యన్! 21–22

దుష్టబుద్ధిగల దుర్యోధనునకు దురభిమానులగు రాజన్యుల్!
ప్రియమును గూర్చగ యిచ్చట జేరిరి రయమున ప్రాణము లర్పింపన్!
అట్టి యోధులను నేను గాంచెదను నరదముపై నే నిలిచియును!
ఉరు సేనల మధ్యమున యరదమును నున్నతగుణ! నిలుపుమువేగన్! 23

సంజయు డిటులను పలికె రాజుతో సరసవాక్య మధురాక్షరముల్!
మహారాజ; ధృతరాష్ట్రభూవిభూ! మానుగ విను! నా వాక్యములన్!
అర్జును డా విధి బలుక కృష్ణుడును నా యుత్తమ రథమును నంతన్!
రెండు సేనలకు మధ్యను నిలిపెను దండి రాజులకు మధ్యమునన్! 24

భీష్మ ద్రోణుల యెదుటను నిలిపెను భీమ విక్రముం డర్జునుతో!
శ్రీభగవానుం డిట్టుల బలికెను స్థిరమగు వాక్యంబుల తోడన్!
'అర్జున! గాంచుము! నా కౌరవులను నచట జేరినా వీరులనూ!
అనుచు బలుక నా హృషీకేశుడును నా నరసఖుడును నట గాచెంన్! 25

రెండు సేనలను నిలిచియున్న యా దండి బంధు మండలి గాంచెన్
పంండ్రుల మఱి తాతలను గురువులను దగ మామలను గుమారులనూ!
మేనమామలను నన్నదమ్ములను మనుమల స్నేహితులను హితులన్!
తన వారందఱగాంచి యర్జునుడు దల్లడమందెను మది యందున్! 26

యుద్ధభూమి నిలిచిన బంధువులను రుద్ధ హృదయమున బరికించీ!
దయార్ద్ర హృదయుండై యర్జునుడును సరసిజాక్షుతో నిటు లనియెన్! 27

ఇచట యుద్ధమును జేయుటకొఱకై యేతెంచిన యీ బంధువులన్!
గాంచి యంగములు బట్టుదప్పినవి గడు దప్పిక యగుచున్నదియున్!

శరీరమంతయు వణుకుచున్నది సర్వము జీకటి యనిపించున్!
గగుర్పాటు గలుగుచు శరీరమును గాండీవము జారుచునుండెన్!
చర్మమంతయును మండుచు నున్నది సకలాంగములును ధృతి దప్పెన్!
మనస్సు గిఱ్ఱున దిరుగుచు నున్నది మాధవ! నిలువగ లేను సుమా! 28-30

అపశకునంబుల గాంచుచుంటినీ! యఁటరి బంధువుల యుద్ధమునన్!
జంపిన బిదపను లాభ మెద్ది యో నింపుగ కన్పింపదు నాకున్! 31

కృష్ణా! నే విజయంబునుగానీ కేశవ! నే రాజ్యముగానీ!
సుఖమునుగానీ కోరను మాధవ! సురుచిర సౌఖ్య సుభోగములన్!
రాజ్యముతో మఱి భోగంబులతో రమ్య జీవితముతోగానీ
ఏమి ప్రయోజన మింక దెలుపుమా! యేల బంధునాశనమింకన్! 32

ఎవరి నిమిత్తము రాజ్యభోగముల నింపుగ సుఖముల గోరుదుమో!
అట్టి గురువులును, దండ్రులు, తాతలు, నల కుమారులును, మామలునూ!
మనుమలు, మఱి యా మేనమామలును మఱుదులు సంబంధితులెల్లన్!
ప్రాణంబులపై ధనముల పైనను బన్నుగ యాశల నాఁదులుకొనీ
ఈ రణరంగము నందున నిలిచిరి నీరజాక్షి! యదె కనుగొనుమా! 33-34

నన్ను జంపు వారైనను గూడను నెన్నగ వీరిని జంపనుగా!
ముల్లోకంబుల యాధిపత్యమును మోదమునను వచ్చిన గూడన్!
భూలోకంబున రాజ్యము కొఱకై బూనుదునా నే నాసక్తిన్?
నే నీ పలుకుల వేఱుగ దెలిపీ నీరజాక్ష వివరింపుదునా? 35

ధార్తరాష్ట్రిలను జంపినందునను దగ గలుగున ప్రీతియు మనకున్!
ఆతతాయిలను జంపినందునను నలరి మనకు పాపమె గలుగున్! 36

కావున కృష్ణా! బంధు బాంధవుల గడగి ధార్తరాష్ట్రిల మనమున్!
హతముచేయుటకు దగము జనార్దన! నాదరింపదగుదురు వారున్!
మనవారిని మన మెట్లు జంపుదుము? మాధవ! యిది ఘోరంబు గదా!
మఱి మన మెటులను సుఖము నందుదుము? మఱి యోజింపుము
దీర్ఘముగన్! 37

రాజ్యలోభమున భ్రష్టచిత్తులగు రహి ధృతరాష్ట్రుని కుమారులున్!
వంశనాశనము, మిత్రద్రోహము వలన గలుగు దోషంబులనూ!
ఒక విధమున వా రెఱుగకున్ననూ! యొప్పుగ రెండిటి దోషములన్!
బాగుగ దెలిసిన మన మదేల యీ పాపకృత్యముల రెండిటినీ
విరమింపంగను జేయగూడదో విశదము గాకున్నది కృష్ణా! 38-39

కులము నశించుటచే ననాదియగు కులధర్మంబులు నశియించున్!
ధర్మనష్టమున కులమంతయును అధర్మము వ్యాపించును కృష్ణా!
అధర్మ వృద్ధియు నొందుటచేతను నలకులస్త్రీలును జెడుదురిలన్!
కులస్త్రీ లట చెడిపోవుటజేతను కుటిల వర్ణ సంకరము నగున్!
వర్ణసంకరము గలుగు కులమునకు నరకము సంప్రాప్తంబు నగున్!
వారిపితరులును శ్రాద్ధంబులునూ యొనరగ దర్పణములు లేకన్!
అధోగతిని బొందుదురు వారలును నమిత ఖేదమును నొందుచునూ!
కులధర్మంబులు జాతిధర్మములు గూరిమి యుండగ వలెనుగదా! 40-42

కుల వినాశకుల జాతిసంకరపు కుటిల హేతువుల దోషములన్
శాశ్వతమగు కుల జాతి ధర్మములు నరగున నశించిపోవు నిలన్
కులధర్మములు నశించిన నరులకు గూరిమి శాశ్వత నరకంబున్!
గలుగుననుచు విన్నాముగదా మఱి గల పెద్దలచే శాస్త్రములన్! 43-44

అయ్యో! కటకట! యెట్టిబాపమును నలరి జేయుచుంటిమి కృష్ణా!
రాజ్యసుఖము నంచలి లోభముచే రహి మన బంధుల జంపుటకున్!
ఉద్యమించితిమి! యెంత పాపమో! యూహింపగ జాలము కృష్ణా! 45

ఆయుధములు జే ధరింపకయును మఱి యలరి ప్రతీకారంబులనూ!
జేయకయుండిన నన్ను గాంచి మఱి చిఱునవ్వుల మది బిందుచునూ!
ఆయుధములు ధరియించినవారును నల సుయోధనాదులు నన్నున్!
రణమున జంపిన మఱింత క్షేమము నాకగు నచ్యుత! నిక్కముగన్! 46

సార్వభౌమ! ధృతరాష్ట్ర భూవిభూ! సరగున రణరంగమునందున్
నారాయణుడగు శ్రీకృష్ణునితో నరుడగు నర్జును డటుబలికి
కలత బొందినా చిత్తము తోడుత కరుణ శోకమును గూడికొని!
బాణముతో గూడిన బాపంబును బాఱవైచి బహు విషాదమున్
గూడి రథములపై జదికిల బడెనూ! కూర్మి మాధవుడు దిలకింపన్! 47

ఈ విధమున బలికెను సంజయుడును నిమ్మగ ధృతరాష్ట్రుని తోడన్!
అర్జున విషాదయోగంబును మఱి నలరుచు ప్రథమోధ్యాయంబున్!
తాను వినిన గాంచిన విషయంబుల దగ ముత్తియములను బేర్చినటుల్!

(అర్జున విషాదయోగము—సమాప్తము)

హరి ఓం

# శ్రీ భగవద్గీత

## సాంఖ్య యోగము

## (రెండవ అధ్యాయము)

మహారాజశ్రీ ధృతరాష్ట్ర విభూ! మానుగ రణరంగము నందున్!
జరిగినదంతయు దెలిపెద ననుచును దగ సంజయుడును బలికె! నిటుల్!
ఆరీతిని గృపయావిష్టుండై యశ్రుపూర్ణ నేత్రంబులతో
గలతజెందినా యర్జునగాంచి! కరుణతోని కృష్ణుండనియెన్!

ఎచ్చటనుండీ దాపురించినది యీ విషమస్థితి యందుననూ!
అనార్యు లవలంబించునదియు మఱి యపకీర్తిని దెచ్చేదిదియునూ!
స్వర్గమునకు బ్రతిబంధకమైనది సఖ! యీ వ్యామోహమునీకున్!
అర్జున! యీ సంగర సమయంబున నలరి వచ్చె నెచ్చటినుండీ? 2

అధైర్యమును నందకుమా అర్జున! యది వీరులకును దగదుగదా!
క్షుద్రహృదయ దౌర్బల్యము వీడీ సిద్ధమగుము! యుద్ధంబునకున్! 3

ఆ మాటలు విని యీ పార్థుండును నాకృష్ణునితో నిటులనియెన్!
మధుసూదన యీ భీష్మద్రోణులు మఱి బూజింపగ దగువారున్
అట్టివారిపై శరముల నాదిలీ యెట్లు జేయగలుగుదు రణమున్! 4

మహానుభావుల గురువుల జంపిన మహాపాపములు గలుగుగదా!
భిక్షాన్నంబును దినుటయె మంచిది! బిరబిర యటులను జేయకనూ!
వారలజంపీ! వారి రక్తమున నిరువుగ దడసిన సంపదలన్
అనుభవింప వలయునుగద కృష్ణా! యటులజేయగను లేను సుమా! 5

జయాపజయములు దెలుపలేముగద! జరిగెడి యుద్ధమునందుననూ!
ఈ రెండింటను యేది శ్రేష్ఠమో! యిమ్ముగ దెలుపగలేముసుమా!
ఎవరిని యంతముజేసి ధరిత్రిని నింపుగ జీవింపగ లేమో!
అట్టి ధార్తరాష్ట్రులు యుద్ధంబున యెట్టయెదుట నిలుచుండిరిటన్! 6

కృపణత్వ మనే దోషముచేతను గూపమందు బడియుంటిని నే
ధర్మవిషయమును సందేహము చే దగ యడుగుచు నుంటిని నిన్నున్!
ఏది నిశ్చయముగ శ్రేయస్కరమో! యింపుగ దెలుపుము శ్రీకృష్ణా!
నను శాశింపుము! నీకు శిష్యుడను? 'నడుచుకొనుము! నీ విధి!'
యనుచున్! 7

భూమండలమున శత్రులులేనీ భూరి రాజ్యమును నందియునూ!
సురాధి పత్యము నందియుగూడను సురుచిరముగ నా యింద్రియముల్
శోషింపగ జేసెడి యీ దుఃఖము శుభచింతన! పోగొట్టుటకున్!
తెలియజాలకున్నాను మాధవా! దీరుగ తెలుపుము మార్గంబున్! 8

సంజయు డా విధి ధృతరాష్ట్రునితో సరగున బలికెను సిరీతిన్!
ఓ రాజా! విను! అర్జును డా విధి యొప్పగ కృష్ణునితో బలికి!
'యుద్ధంబును నే శేయకాలనో సిద్ధ పురుష!' యని యర్జునుడున్!
మాటాడక మౌనమును వహించెను మౌనివోలె యరదము పైని! 9

ఓ భూవల్లభ! ధృతరాష్ట్ర వినూ! యొప్పగ నాదగు పలుకులనూ!
రెండు సేనలకు మధ్య రథముపై నిండు శోకమున విలపించూ!
అర్జును గాంచీ కృష్ణుడు నవ్వుచు అలరి బలికెనీవిధముగనూ!

## ఆత్మతత్త్వ నిశ్చయము

దగ శోకింపగ దగని వారికై దగ శోకించుచు నుంటివిగా!
ప్రజ్ఞావాదముతోడగూడ మఱి భాషించుచు నుంటివి మఱియున్!
మరణించిన వారిని గుఱించియును మరణింపని వారలగూర్చి!
జ్ఞానులైన బండితు లెప్పుడునూ మానసమున జింతింపరుగా! 10

నేనుగాని మఱి యర్జున వినుమా! నీవుగాని యీ రణమందున్!
గల భూపతులును, గల బాంధవులును గల సఖులును మఱి సైనికులున్!
లేనివారలము గాము నొకప్పుడు లేకపోవు వారము గామూ!
దేహి శాశ్వతుండని తలంపుచూ! దేహము నస్థిరమని యనుచున్! 11

బన్నుగ జీవున కీ శరీరమున బాల్య వయో వార్ధక్యములున్ !
అవస్థ లవి యెటు గలుగుచున్నవో యటులే మరణానంతరమున్ !
దేహాంతరస్థితి గలుగుచుండుటను దేహికి గలుగుచు నున్నదిగా !
కావున యీ విషయంబునందునను గలతను బొందడు జ్ఞానియునూ ! 13

శబ్ద స్పర్శ సంయోగ విషయములు జరుగుచుండు నింద్రియములకున్ !
సుఖదుఃఖంబులు శీతోష్ణంబులు స్థిరముగ నుండవు యెల్లవుడున్ !
వచ్చుచు బోవుచు నుండును భారత ! వరుసగ యస్థిరములు నగుచున్ !
సహనముతో వానిని సహింపుమా ! సద్గుణవంతుడ ! కుంతిసుతా ! 14

పురుషశ్రేష్ఠుడ ఓ కౌంతేయా ! పొలుపుగ యే మానవుని యిలన్
శబ్దస్పర్శములు, సుఖదుఃఖంబులు జలింపజేయక యుండెడినో !
సుఖదుఃఖంబుల సమభావముతో నూటిగ గాంచునా నిరపేక్షన్
అట్టి ధీరుడే యమృతత్వంబున నర్హుడగును సుమ కౌంతేయా ! 15

అసత్యంబుదై నామరూపముల యలరి నశించెడి నట్టివియున్ !
దేహాదులకును నునికిలేదు మఱి స్థిరత్వంబు మఱి లేదు సుమా !
సత్యమైన యాత్మకు నస్థిరతయు సఖుడా ! లేమియు లేదు సుమా !
తత్త్వజ్ఞానులు రెండిటి విషయము దఱచి గ్రహించిరి విషయంబున్ ! 16

ఈ ప్రపంచమంతయుగూడను మఱి యే యీశ్వరుచే నిండినదో !
నాశరహితమని దెలియు మర్జునా ! నయముగ యా తేజోదీప్తిన్ !
అవ్యయమగు నా యాత్మశక్తి యిల యలరి శాశ్వతంబై యుండున్ !
నశింపజేయగ జాల డెవ్వడును నశించు సర్వము నీ జగతిన్ ! 17

నిత్యుండును మఱి నాశరహితుడును నప్రమేయుడును శాశ్వితుడున్ !
అట్టి దేహి దేహములు నశించును నలం దెలుపబడె నార్యులచే
అట్టి యాత్మ విషయంబున గానీ యలరి దేహ విషయంబుననూ
శోకదుఃఖముల దూరము జేయుము శూరుడవై జేయుము రణమున్, 18

ఎవడీ యాత్మను జంపువానినిగ యెవడు జంపబడువానినిగా
భావించునొ వారిరువురు గూడను భవ్యసత్యమును గాంచరుగా !
యదార్థముగ యీ యాత్మ దేనినీ నలరి జంపుటయు లేదు సుమా !
ంపబడుటయును లేదు నర్జునా ! శాశ్వితుండుగద దేహి యిలన్. 19

్టుట గిట్టుట లేదు నాత్మకును బునర్భవంబును లేదు సుమా !
పూర్వమందు లేకుండ క్రొత్తగా బొలుపుగ వచ్చిన వ్యక్తియునూ !
కాదుసుమా యర్జున ! విను మీతడు గడగి జనన మరణంబులునూ
లేనివాడు శాశ్వితుడు బూర్వుడును నప్రమేయుడును బూజ్యుండున్ !
ఈ దేహము మఱి చంపబడినను నీతడు మృతి బొందుట లేదూ ! 20

ఏ మానవు డీ యాత్మను నిత్యగ యిమ్ముగ శాశ్వత పురుషునిగా !
జనన మరణములు లేనివానిగా జాగృతి లొందునొ మదియందున్ !
అట్టివా డెటుల నొరు జంపించును ? నిట్టె తాను జంపును నొరులన్ ? 21

శిథిల వస్త్రములు విడిచి మానవుడు శ్రీకరమగు నవ వస్త్రములన్ !
ధరించుచున్నాడో నా రీతిని దగ దేహియు నగు నాత్మయునూ !
శిథిలములగు దేహములను విడిచియును శీఘ్రము నూతన దేహములన్ !
ధరించుచున్నా డో! యర్జున విను ! ధాత్రిని సకలము నిటు జరుగున్ 22

ఈ యాత్మను శస్త్రంబు లేవియును నింపుగ ఛేదింపగ లేవూ !
దహింపజాలదు నగ్ని మఱియునూ దడుపగ జాలవు జలములునూ !
గాలియు శోషింపగ జాలదు సుమ ! కలుషరహితమగు నీ యాత్మన్ ! 23

ఛేదింపగబడ జాలదు నాత్మయు భేదింపగబడ జాలదుగా !
దహింపబడజాలదు నర్జున ! విను ! దడుపగ బడజాలడు నితడున్ !
ఎండింపగ బడజాలడు నిత్యుడు నిండిన వాడీ సర్వమునూ !
స్థిరస్వరూపుడు పురాతనుండును చిరంజీవి నిశ్చలు డితడున్ ! 24

అవ్యక్తుడు మఱి యచింత్యనీయుడు నలరి యింద్రియంబుల కతడున్
వికారములు బొందింపగ రానీ విమల జ్యోతి రూపుం డితడున్ !
అందువలన యీవిధము దెలిసికొని యాత్మ రూపమును గ్రహియించీ !
మది విషాదమును నందబోకుమా ! మానుగ రణమును జేయుమికన్ !
దేహముతో బాటుగ నీ యాత్మయు దిరముగ బుట్టుచు జచ్చుచునూ !
యుండుననియు భావించిన గూడను నిండు మనసునను నీ రీతిన్
శోకించుట మఱి దగదు నర్జునా ! శోభోత్కరమును-గాదుగదా ! 26

చావు బుట్టుకలు గలవానినిగా సరసత నీ యాత్మను నీవున్
భావించినచో ఓ కౌంతేయా ! పన్నుగ భావింపుము మదినీ !
పుట్టినవానికి మృత్యువు దప్పదు గిట్టినవానికి జన్మంబున్ !
దప్పనిసరియగు వాని విషయమున దగ శోకింపగ రాదుగదా ! 27

భూతకోటి యంతయును నర్జునా ! పూర్వము గనబడకుండుటయున్
బుట్టిన బిదపను దేహాదులతో బడమిని గనబడు చుండుటయున్ !
మరణించిన బిదపను భూతంబులుమఱి గనబడకను యుండుటయున్ !
గనబడుచున్నది యట్టివానికై యలరి శోకమున బశనేలా ?
భ్రాంతిరూపమగు దేహంబులకై బాధను నొందుట యేల యిటుల్?
అటులగాక యవ్యక్త రూపమును నాదియందు గలదో మఱలన్ !
అవ్యక్తంబును బొందుచుండగా నలరి విషాదం బెందులకూ ? 28

ఒకానొకడు ఈ యాత్మ జ్యోతిని నొప్పుగ గను నాశ్చర్యముగన్ !
మఱి యొక డాత్మను గాంచి చిత్రమున మర్మముగా దెలుపుచునుండున్ !
అటులే వేఱొక రుండు నాత్మనూ యలరి చిత్రముగ వినుచుండున్ !
గాంచినవాడును దెలుపువాడు మఱి వినినవాడు వీరందఱునూ
సాక్షాత్తుగ నొక్కండు గూడనూ సరిగా దెలియుట లే దాత్మన్ ! 29

అర్జున ! వినుమా ! యశేషప్రాణుల యలరు దేహముల యుండిన యా
ఆత్మ యెన్నడును జంపబడదు సుమ ! యప్రమేయు దవినాశుండున్ !
ఏ ప్రాణిని గూర్చియును నర్జునా ! నిమ్మగ శోకింప దగదూ ! 30

స్వకీయమగు క్షత్రియ ధర్మంబును సరసత బరికించిన గూడన్ !
యుద్ధమునకు వెనుదీయరాదు గద ! యుద్ధమె క్షత్రియ ధర్మంబౌ !
ధర్మయుద్ధమున కంటె రాజునకు ధర్మము వేరే లేదుగదా ! 31

అప్రయత్నముగ లభించు నట్టిది యర్జున ! స్వర్గ ద్వారంబున్ !
ఈ దృశముగ యుద్ధమును క్షత్రియులు నింపుగ బొందుదురో వారున్!
నిక్కముగా సుఖమును నందుదురా చక్కని స్వర్గము నందుననూ ! 32

అందువలన యీ ధర్మయుద్ధమున యలరి యుద్ధమును జేయనిచో
స్వధర్మమును నిరసించిన వ్యక్తిగ సకలకీర్తి బోగొట్టుకొనీ !
పాపంబును మఱి మూటగట్టుకొని పతితుడ వౌదువు నీ ధాత్రిన్ ! 33

నీ యపకీర్తిని జెప్పుకొందు రిక నిఖిల జనులు నీ లోకమునన్ !
గౌరవముగ యిల బ్రతికినవారికి గలిగినచో యపకీర్తి యిలన్
జావుకంటె నధికముగా దలతురు సజ్జనకోటియు నీ పుడమిన్ 34

ఏ మహారథులు నింతవరకు నిను నింపుగ ఘనముగ భావించీ !
గౌరవించిరో వారందఱునూ కడు చులకన భావముతోడన్
యుద్ధమునుండీ మఱలినవానిగ సిద్ధము దలతురు మదియందున్
భయస్థునిగ నిను భావించెదరూ భవ్యకీర్తి యంతయు బోవున్ ! 35

ఇంతమాత్రమే కాదు అర్జునా ! వింతగ నీ శత్రులు గూడన్ !
నీ సామర్థ్యము దూషించుచు మఱి నిందింతురు దుర్భాషలనూ !
దీనికి మించిన విషాద మింకను దీరుగ గలదా భువియందున్ ? 36

యుద్ధమందు మరణించిన యర్జున! సిద్ధము స్వర్గము నందెదవూ!
జయము నందుచో భువన భోగముల సౌఖ్యములను బొందుదు వింకన్!
ఈః ప్రకారముగ రెండు మార్గములు నింపుగ మేలే కౌంతేయా!
కావున లెమ్మిక సంశయింపకుము గదనమునకు సిద్ధము గమ్మా! 37

సుఖదుఃఖములను జయాపజయములు సురుచిర లాభము నష్టములన్!
సమానమని భావించి యుద్ధమున సన్నద్ధుడవై శూరుడవై
ఇటులజేయుచో పాపమునంటదు యింక లెమ్ము! యుద్ధంబునకున్! 38

అర్జున విను! నేనింత వఱకునూ నలరి సాంఖ్య శాస్త్రంబుననూ
ఆత్మతత్త్వ నిశ్చయమును దెలిపితి నాత్మ విశ్వరూపము నీకున్!
ఇంక యోగశాస్త్రమున దెలిపినా కర్మయోగ సంబంధమునూ!
అట్టి వివేకము దెలుపుచుఃటినీ! నలరి వినుము! ఓ కౌంతేయా!
ఎఱిగించినచో కర్మబంధముల నెఱిగి విముక్తుడ వయ్యెదవూ!
సావధానముగ యాలకింపుమా! సవ్యసాచి నే దెలుపునదీ! 39

## కర్మయోగ వివేకము

ప్రారంభించిన కర్మయోగ మది ఫలితము నిచ్చును కౌంతేయా!
నిష్ఫలమది యెన్నటికిని కాదూ! నిరాశ జెందగ వలదు సుమా!
మధ్యాంతరమున నిలిచిన గూడను నతి దోషంబును లేదు సుమా!
ఇట్టి ధర్మమది యొకింతయైనను గట్టిగ జేసిన లోకమునన్
రక్షించుచు నున్నది కవచముగా రహి సంసార భయంబుననూ! 40

కర్మయోగమును ననుష్టించెడీ కర్మయోగులకు గౌంతేయా!
నిశ్చయంబుతో నుండిన బుద్ధియు నిర్మలమతి యొక్కటి యుండున్!
నిశ్చయ బుద్ధియు లేనివారలకు నిరంతరము బహువిధములుగన్!
అనంతములుగా వర్తిలుచున్నవి యలరుచుండు వారల బుద్ధుల్! 41

వేదములందున ఫలమును దెలిపెడి వివరించెడి భాగములందున్!
నిష్టముగలవారును, నందునగల నిమ్ముగ స్వర్గాదుల కంటెన్!
అధికమైన ఫలితములు వేఱొకటి యది యెద్దియు మఱి లేదనుచున్!
వాదించెడి వారును, వాంఛలతో నొనరిన జిత్తము గలవారున్!
స్వర్గమునం దభిలాష గలిగినా నల్పజ్ఞులు నగు వారలునూ!
జన్మకర్మ తత్ఫలము నిచ్చెడిది సరసత భోగము లిచ్చెడిదీ!
వివిధ కార్యములతో గూడినదీ విను! ఫలశూన్యంబైనదియున్
ఏ వాక్యంబును దెలుపుచుండిరో యద్దానిని విని భ్రమతోడన్!
సమ్మోడివారను, సుఖభోగములకు నయముగ ప్రియులగు వారలకున్
దైవధ్యానము, సమాధినిష్ఠయు దగు బుద్ధియు గలుగదు వినుమా! 42–44

వేదములందలి పూర్వ భాగమున విను మర్జున! త్రిగుణాత్మకముల్
విషయములను దెలుపును మఱి నీవును వే నిస్త్రైగుణ్యుడ వగుమా!
నిర్ద్వంద్వంబును శుద్ధసత్త్వమును నిర్మలమతి యాశ్రయమందీ
యోగక్షేమములను స్మరియింపక దగ యాత్మజ్ఞానివి గమ్మా! 45

స్నానపానముల కుపయుక్తంబగు స్వల్పజలముగల కూపమునన్!
ఎంతటి ప్రయోజనము గలదో మఱి యంతటి లాభము నది యందున్!

ఇమిడియున్న చందమున వేదముల నిమ్ముగ సమస్త కర్మలలో
ఎంతటి ప్రయోజనము గలదో మఱి యంత ప్రయోజన లాభములున్!
పరమార్థత్వము నెఱిగినట్టి యా బ్రహ్మ నిష్ఠునకు నిశ్చయమున్!
బ్రహ్మానందమునందు నున్నదీ బన్నుగ శంకింపగ వలదూ! 46

కర్మల జేయుటయదే యధికారము గలదు సుమా! అర్జున నీకున్
కర్మ ఫలంబుల నాశించుటలో గలుగదు నీ కధికారంబున్!
కర్మఫలములకు నీ వెన్నడునూ గాకుము గారణ భూతుడవున్!
కర్మల మానుట యందు గూడనూ గలుగకుండు గావుత రక్తిన్! 47

యోగనిష్ఠయం దుండి ధనంజయ! దగ సంగమమును ద్యజియించీ!
ఫలించినను కార్యము మఱి కార్యము ఫలింపకున్నను కర్మలనూ!
సమభావముతో నున్నవాడవై సర్వకార్యముల జేయు మికన్!
అట్టి సమత్వవు బుద్ధియె పార్థా! నలరి యోగమని బలుకుదురూ! 48

సమత్వబుద్ధిని నిష్కామముతో సఖ! జేసెడి కర్మలకంటెన్
ఫలాపేక్షతో గూడిన కర్మలు ఫల్గుణ! బహు దక్కువయు గదా!
కావున సమ నిష్కామ కర్మలను గడగి జేయుమా! సమబుద్ధిన్,
ఫలములు గోరెడు వారలు దీనులు! బన్నుగ బొందుము సమబుద్ధిన్! 49

బుద్ధి యుక్తుడగువాడు యోగమున పుణ్య పాపముల రెండిటినీ
ఈ జన్మంబున దొలగ ద్రోయునూ! నిమ్ముగ సమత్వమును నందీ!
నిష్కామంబగు కర్మయోగమును నిరతము యత్నింపుము జేయన్!
కర్మలయందలి నేర్పరితనమే గాండీవీ! యోగంబు సుమా! 50

సమత్వబుద్ధిని గూడిన వారలు సదమలమతితో నెల్లపుడున్!
బుద్ధియుక్తులను వివేకవంతులు బొలుపుగ కర్మల జేసిననూ!
వాని ఫలములను ద్యజించివైతురు వరుస జనన మరణంబులనూ!
తొలగి దుఃఖరహితంబగు మోక్షము దొరముగా బొందుదు రంతన్! 51

అజ్ఞానంబను మాలిన్యంబును నర్జున! నీ బుద్ధియునెపుడున్
దాటివేయునో పరిశుద్ధంబగు దగ జ్యోతీ స్వరూపంబై!
అప్పుడింక విన వలసినదానిని వినిన వానినీ గూర్చియునూ!
నిర్వేదంబును నందవు ఫల్గుణ! నిర్మల చిత్తము నందెదవూ! 52

నానా విధముల శ్రవణాదులచే నలత జెందినా నీ మనసున్!
ఎపుడు జలింపక నీశ్వరు దలచుచు నింపుగ స్థిరముగ నుండెడినో!
అపుడు నీవు నాత్మను దర్శించెదు నఖిలేశుని దయ నందెదవూ!
నలత కలతలను జెందకు మర్జున! నానావిధ శ్రవణాదులచేన్! 53

అర్జును డిటులను బలికే వినయమున యఖిలేశుండగు కృష్ణునితో!
కృష్ణా! దెలుపుము! సమాధినుండిన కృప! స్థితప్రజ్ఞుండైనట్టి
జీవన్ముక్తునిలక్ష్మణ ముఁనూ స్థిరముగ దెలుపుము నా కిపుడున్!
అతడెట్లు మాటాడు? జరించును? నాత డెట్టి రీతిగ నుండున్? 54

## స్థితప్రజ్ఞుని లక్షణములు

భగవంతుడగు గృష్ణుడు నలికెను దగ పార్థునితో నీ రీతిన్
అర్జున విను! ఏ మనుజుడు మనసున యలరుచు గోర్కెల నన్నిటినీ
సంపూర్ణముగా ద్యజించి వైచునో సదా నిర్మలంబగు బుద్ధిన్!
ఆత్మయందునను నాత్మచేతనే యలరుచు సంతుష్టిని నొందున్!
అప్పుడాతడే స్థితప్రజ్ఞుండని జెప్పబడును వినుమా! పార్థా! 55

దుఃఖమునందును గలతనొందకను ధ్రువమగు మనస్సు గలవాడున్
సుఖములందు నాసక్తియు లేకను సురుచిరముగ ననురాగంబున్!
భయక్రోధంబులు దొలగినవాడును భవ్య మనన శీలుండతడున్!
స్థితప్రజ్ఞుండని జెప్పబడును సూ 'ధీరుడైనముని' యనబడునూ! 56
ఎవడు సకల విషయంబులందునను నిరవుగ యభిమానము లేకన్!
ఆ యాశుభా శుభముల యందునను నల సంతోషము ద్వేషంబున్!
బొందకుండునో యట్టి మనుజుడే యాతడు స్థితప్రజ్ఞుండగునూ!
అతని జ్ఞానమే స్థిరమైనది సుమ! యాతడు ముని యని తెలుపబడున్! 57

కూర్మ మెటుల దన యవయవంబులను గూరిమి లోనికి ముడుచుకొనున్!
అటులే యోగియు దన యింద్రియముల యలరి యింద్రియార్థములైనా!
విషయములను దరిజేరనీక మఱి వెనుకకు మఱల్చు చున్నాడో!
అపుడాతని జ్ఞానము స్థిరమైనది యాతడె స్థితప్రజ్ఞుం డగునూ! 58

విషయములను వర్జించు జీవునకు విషయంబులు దొలగుచునుండున్!
దొలగుచున్నవే గాని పార్థ! విను! దొలగుటలేదా వాసనయున్!
బరమాత్మను దర్శించినచో మఱి పటాపంచలగు వాసనయున్!
విషయంబులతో బాటు దొలంగును! విమలమగును నాతని బుద్ధి! 59

అర్జున వినుమా! యింద్రియంబులును నతి బలవంతంబులును సుమా!
ఏలయనిన యాత్మావలోకనము యలరి జపించెడి విద్వాంసున్
మనసును గూడను బలవంతముగా మఱల్చి విషయంబుల వైపున్!
లాగికొనుచు బోవుచునున్నది గద! రాజభటులవలె వేగముగన్! 60

బలవంతములగు నీ యింద్రియముల బాగుగ వశమును బఱచుకొనీ!
సాధకుండు మఱి మనోస్థిరత్వము చక్కని సమాధి గలవాడై!
నా యందే యాసక్తిని గలుగుచు నయముగ దగిలి యుండవలెన్!
ఎవని యింద్రియంబులు సుస్థిరమో యతని జ్ఞానమే సుస్థిరమున్! 61

మానవుండు శబ్దాదివిషయముల మది జింతించుట జేత నికన్!
ఆ విషయంబులపై నాసక్తియు నలరి గలుగుచున్నది ప్రార్థా!
ఆ యాసక్తిని దానియందునను నలరి కోర్కె జనియించెడినీ!
ఆ కోరికచే గ్రోధంబును మఱి యా క్రోధముచే మోహంబున్!
ఆ మోహముచే మఱపును మఱియును నా మఱపున గలుగును వేగన్!
బుద్ధి నాశమును గలుగుచున్నదీ పూర్తిగ జెడిపోవును దుదకున్! 62-63

ఆత్మవశ్యుడును, విధేయాత్ముడును నలరి రాగ ద్వేషంబులునూ!
లేనివాడునై, యధీనంబులగు దనదు నింద్రియంబుల జేతన్!
దేహ యాత్ర జరుపుచు నింద్రియముల దీటుగ నడిపెడు వాడై నన్!
మనో నిర్మలత్వంబును బొందుచు మనశ్శాంతినొందును మిగులన్! 64

మనో నిర్మలత్వమున యర్జునా! మది దుఃఖము లన్నియు బాయున్!
ప్రసన్నాత్మునకు బుద్ధి శీఘ్రముగ పరమాత్మునిలో లగ్నమగున్! 65
ఇంద్రియనిగ్రహమును గౌంతేయా! యిమ్ముగ మనస్సు సంయమమున్!
లేనివానికిక వివేక బుద్ధియు లీలగ గలుగదు బరంతపా!
ఆత్మ జింతనయు సంభవింపదూ! నటుపై శాంతి యుగలుగదుగా!
శాంతిలేని వానికి సుఖమెచ్చట? భ్రాంతినుందు నత డెల్లపుడున్! 66

విషయంబులలో బ్రవర్తించెడి యింద్రియములలో నెద్దానిన్
అనుసరించి బోవునొ మనస్సదూ ఋయ్యది నరుని-వివేకమునూ!
ప్రవాహమున బ్రతికూల వాయువులు వాటముగా నడిచెడి నావన్!
బెడదారికి గొనిపోవునట్లుగా జెడుదారికి గొనిపోవుగదా! 67

కావున యర్జున! యెవ డింద్రియముల గదలనీక విషయంబులపై
సర్వవిధములను నిరోధించునో సద్గుణవంతుఁ డనదగునూ!
అతని జ్ఞానమే సుజ్ఞానము సుమ! యతనిని 'ధీర్మని' యనవచ్చున్
అతని జ్ఞానమే స్థిరమై యుండును. నంతరిక్ష ధ్రువ తారగనూ! 68

సర్వప్రాణులకు నేది రాత్రియో సంయమివర్తులు, యోగులటన్!
మేలుకొనుచు నుందురు కుంతీసుతఁ మేలుకొందురో ప్రాణులునూ!
ఆత్మదర్శనము జేయు మునీంద్రులు నదియ రాత్రిగా దలచెదరూ! 69

నిర్మలజలములు నిండినదియును మఱి నిశ్చలమైన సముద్రమునన్!
నదీ జలములవి యేవిధంబుగను నలరి బ్రవేశించుచు నుండున్!
ఆ విధముగనే కామ విషయములు నలరి బ్రహ్మనిష్ఠుని బొందీ!
అలత కలతలను జేయలేక మఱి యణగి బోవు నాతని యందున్!
విమల శాంతియత డందునుగానీ విషయాసక్తుడు గాదుగదా! 70

ఎవడు సమస్తములగు గోరికలను నీసడించునో దూరముగా
శబ్దాదుల విషయముల త్యజించీ శాంతినొందు యాశలు లేకన్!
అహంకార మమకారములను విడి మధురముగా వర్తించెడినో!
ఆతడు శాంతిని బొందును బార్థా! యాతడె స్థితప్రజ్ఞుండు సుమా! 71

అర్జున! యిదిమంతయు మది గనుమా! బ్రహ్మస్థితి యని దెలియు మికన్!
ఇట్టి స్థితిని బొందిన వాడెన్నడు నెట్టి విమోహము జెందడుగా!
అంత్యకాలమున గూడ నిట్టిస్థితి యలరియున్నవా రెవరైనా
బ్రహ్మానందమునగు మోక్షంబును బడయుచున్న వా డిది నిజమూ!
ఈ విధముగ యీ సాంఖ్యయోగమును నిమ్ముగ నా మధుసూదనుడున్!
అర్జునకు నుపదేశించెను మతి నలరి కురుక్షేత్రమునందున్!
అనుచదెలిపె ధృతరాష్ట్ర భూపతికి నల సంజయుడును బ్రియమారన్!
తాను వినిన గాంచిన విషయంబుల దగ ముత్తియములను గ్రుచ్చినటుల్!
72

(సాంఖ్య యోగము సమాప్తము)

హరి ఓం

# శ్రీ భగవద్గీత

## కర్మ యోగము

### మూడవ యధ్యాయము

గాండీ విట్టుల వలికె గృష్ణుతో గద్గత కంఠస్వరముననూ!
జనార్థనా! విను! కర్మముకంటెను జ్ఞానము శ్రేయం బైనదనీ
నీ యభిమత మగుచో శ్రీకృష్ణా! నిర్దయ పూరిత మైనదియున్!
భయంకరంగు యుద్ధకర్మమున బ్రవర్తింప జేయుట యేలా! 1
సంధిగ్ధంబగు వాక్యము వలనను సరసిజాక్ష! నా హృదయమునన్
గలవరబఱచుచు నుంటివి కృష్ణా! కరుణతోని వివరింపుమికన్!
దెలుపుము లొక దానిని నిశ్చితముగ దేటబఱచి విషయంబు నికన్!
కర్మ జ్ఞాన మార్గములను శ్రేష్ఠము నిమ్ముగ దెలుపుము నొకదానిన్ 2
శ్రీ భగవానుడు నర్జును గనుగొని శ్రీకరముగ నిటులను బలికెన్!
ఈ లోకంబున బూర్వ, కాలమున ద్వివిధ నిష్ఠలవి నా చేతన్!
సాంఖ్యులకును మఱి జ్ఞానయోగమును సరసత దెలిపితి బ్రియమారన్!
యోగులకును నే కర్మయోగమును దగ దెలిపితిని బ్రకాశముగా! 3
మనుజుడు గర్మల నాచరింపకను మహిలో జరించినందుననూ!
నిష్క్రియమైనా యాత్మస్వరూపము నిర్మలమతి నందగ లేడూ!
కర్మ త్యాగ మాత్రముచే నెవడును నిర్మల మోక్షము గనలేడూ! 4
ఈ ప్రపంచమున యేనరుడైనను నిమ్ముగ క్షణకాలం బైనన్!
కర్మజేయకను నుందగ జాలడు గర్మజేయు బ్రతిజీవియునూ!
ప్రకృతి వలన బుట్టితే గుణములచే బ్రతివాడును, నీ లోకమునన్!
బలవంతముగా జగతి కర్మలను బటుతరముగ జేయుచునుండున్! 5

ఎవ డీ కర్మేంద్రియముల మఱియును నిమ్ముగ జ్ఞానేంద్రియములనూ!
అణచివెట్టి దా మనస్సుజేతను నా యింద్రియముల శబ్దాదుల్
విషయంబుల జింతించుచుండునో వివేకహీనుడు ననబడునూ!
అట్టి నరుడు　కపటీ గడు ద్రోహియు యనబడుచుండును శాస్త్రములన్!
6

అర్జున! యెవ డీ యింద్రియంబులను యలరి మనస్సున నియమించి!
వానిచేత మఱి కర్మయోగమును వరుసను సంగము లేకుండన్!
ఆచరించునో యాత డుత్తముడు అర్జున! విను! నే దెలుపునది!　7

అర్జున! శాస్త్రములను నియమితమగు నలరి కర్మలను జేయుమికన్!
కర్మ జేయ కుండుట కంటెను మఱి కర్మ జేయుటయె శ్రేష్ఠంబున్!
కర్మల జేయకపోవుట వలనను నిర్మల శరీర యాత్రయునూ
సిద్ధింపదు గద! యీ లోకంబున సిద్ధింపదు మఱి మోక్షంబులన్!　8

అర్జున! భగవత్ప్రీతికరంబును! నఖిలలోక హితకరమైనా!
యజ్ఞ కర్మముః కంటె యితరమగు నస్థిర కర్మల జేత జనుల్!
బంధింపగ బడుదురు గొంతేయా! బన్నుగ యజ్ఞము గొఱకైనా!
కర్మమునే మఱి యాచరింపుమా! కాంక్షలేక ఫలమందు ననూ!　9

పూర్వముండునను బ్రహ్మదేవు డిల బొలుపుగ యజ్ఞంబుల తోడన్!
ప్రజలను సృజించి 'ఈ యజ్ఞములను జన్నుగ యభివృద్ధిని గనుడూ!
ఈ యజ్ఞము లిక మీ కోరికలను నెఱవేర్చెడి గావుత!' యనుచున్!
దా సృజించినా ప్రజతో బలికెను దగ మధురాక్షరముల తోడన్!　10

ఈ యజ్ఞంబులతోని దేవతల నింపుగ తృప్తిని జేయుడికన్!
ఆ దేవతలును వర్షాదులచే నలరి దృప్తి నొందింతురుగా
ఈ ప్రకారముగ పరస్పరంబును నింపుగ తృప్తిని బొందుటచే
ఉత్తమ శ్రేయస్సులను బొందుదురు నుర్వియందు సుఖములు గలుగున్!
11

ప్రజలు జేయు యజ్ఞంబులజేతను బన్నుగ సురలును సంతృప్తిన్
నిష్టబోగముల నిత్తురు ప్రజలకు నిష్ట భోగ్య వస్తువులుమఱిన్!
యర్పించిన యా భోగ్య వస్తువుల యర్పింపక వారికి మఱలన్!
అనుభవించునో వాడు నొంటరిగ యలరి చోరుడగు కౌంతేయా 12

యజ్ఞము నందున మిగులు బదార్థము నలరి భుజింతురొ సజ్జనులున్!
సకల పాపములనుండి ముక్తులై సర్వేశ్వరు దయ నందుదురా!
తమ నిమిత్తమే యెవరు భుజింతురొ దగు బాపములను బొందుదురా!
అట్టివారు బాపమును భుజించెడి యగువారే యగుచుందు రిలన్! 13

అన్నము వలనను గలుగుచు నున్నవి యఖిల ప్రాణులును లోకమునన్!
అట్టి యన్నమును గలుగుచు నున్నది యలరి మేఘముల వలన సుమా!
అలమేఘంబులు గలుగుచు నున్నవి యల యజ్ఞంబుల వలన సుమా!
యజ్ఞముగూడను గలుగుచునున్నది విజ్ఞుడ! సత్కర్మల వలనన్! 14

సత్కర్మంబును గలుగుచునున్నవి సరసత వేదంబులవలనన్!
వేదముగూడను గలుగుచు నున్నది విను మక్షర పరబ్రహ్మమునన్!
అట్టి సర్వ వ్యాపకమగు బ్రహ్మము నాది యంతమును లేనిదియున్!
యజ్ఞమునందున బ్రతిష్ఠింపబడి యలరి యున్నదని దలపు మదిన్! 15

అర్జున యీ విధి బ్రవర్తింపబడు నలరు ధర్మ చక్రమును ధరన్!
అనుసరించి వర్తింపడొ వాడిక జనును బాప జీవితమునకున్!
ఇంద్రియలోలుండై వ్యర్థంబుగ యిల జీవించుచు నుందు సదా! 16

ఏపురుషుడు దన యాత్మయందుననె యిమ్ముగ క్రీడించునుండున్!
ఆత్మయందునను దృప్తి నొందుచును నాత్మను సంతుష్టియు బొందున్
అట్టిజ్ఞాని కిక జేయవలసినది యెట్టి విధియు మఱి లేదు సుమా! 17

అట్టి యాత్మ జ్ఞానికి ప్రపంచమున యలరి కర్మ జేయుట చేతన్!
ఎట్టి ప్రయోజనమును లేదు సుమా! ఇమ్ముగ డెయక యుండుట చే!
దోషముగానీ లేదు నర్జునా! దోరముగా నాతనికి మఱిన్
సకల భూతములయందు నెవరినీ సరసత యాచింపడు దేనిన్! 18

కావున సంగము లేనివాడవై కాంక్షలేక ఫలితముపైనీ!
కర్మను జేయుము! నిరంతరమును గార్యగతిని సద్భావముతో!
ఏ పురుషుం డిల యనాసక్తుడై నిమ్ముగ జేయునో కర్మలనూ!
ఆ పురుషుండును మోక్షమునందును మానుగ క్రమమున గౌంతేయా! 19

జనకుడు మునుగువారు పూర్వమున జనిరి పుణ్య లోకంబులకున్!
నిష్కామంబగు గర్మల చేతను నిర్గుణవంతులునై వారు వాసున్!
జనులను సన్మార్గమున నడుపుటకు దగ నుద్దేశముచేనైనన్!
దగియున్నాడవు గర్మ జేయుటకు దగజేయుము గర్మల నీవున్! 20

శ్రేష్ఠుడెట్టి కర్మలను జేయునో జెలగి యిష్టమున నా దారిన్!
దక్కినవారును జేయుదు రర్జున దగ బోవుదురా మార్గమునన్!
శ్రేష్ఠుడు దేనిని ప్రమాణంబుగా స్వీకరించునో లోకమునన్
దక్కినవారును నట్టిదానినే దగ గొనియెదరు ప్రమాణమునన్! 21

అర్జున నేనీ మూడు లోకముల నలరి జేయునది యెద్దియునూ!
కార్యమేదియును లేదుసుమా మఱి గడగి బొందబడనిదియు మఱిన్
పొందదగినదియు వస్తువు లేదూ బొందుగ నటులయినను గూడన్!
కర్మయందు నే ప్రవర్తించుచును గాండీవీ! నిరతము నుందున్! 22

ఏలయనగ నే నిరంతరంబును నిమ్ముగ జాగ్రత పరుడనునై
కర్మయందు నే వర్తింపనిచో బరికించును నా వర్తననూ!
మనుష్యులందఱు ప్రవర్తించెదరు మఱి నా నడిచిన మార్గమునన్
లోకజనుల నందఱు నిశ్చయముగ జీకు గూర్చినా వాడగుదున్! 23

కర్మ జేయకుండిన విను మర్జున! కలుషితులై బోవుదురు జనుల్!
సంఘమునందున సంకరమేర్పడు యట్టి సమయమున కౌంతేయా!
అట్టి సంకరముననుగ గర్తను నేనగుదును నిశ్చయముగా నపుడున్!
లోకజనుల నందఱు నిశ్చయముగ వానిని గూర్చినవాడగుదున్! 24

అజ్ఞానులు గర్మలను దగుత్కొని యాసక్తిని ఫలముల నందన్!
కర్మల నే విధి జేయుచుందురో కరుణా మయులగు జ్ఞానులునూ!
కర్మలందు మతి సురులు దిడుగకను గాంక్షలేక ఫలముల యందున్!
భూతకోటి కల్యాణ నిమిత్తము బొలుపుగ కర్మలు జేయవలెన్. 25

కర్మసంగులగు నజ్ఞానులనూ కదుపరాదు వారల బుద్ధిన్!
జ్ఞానియైనవా డెల్లప్పుడునూ వినయముతో యోగము తోడన్!
నేర్పుతోని దా సమస్త కర్మల నిర్మలమతి జేయగ వలయున్!
తన సమాచరణ గాంచి సర్వులను దగజేయునటుల జేయవలెన్! 26

ప్రకృతివలన బుట్టిన గుణములచే బనులన్నియు జరుగుచునుండన్!
అహంకారమున వివేకశూన్యుడు నలరి కార్యముల నన్నిటిన్!
తానే జేయుచు నున్నవాడనని దగ దలచును అజ్ఞానునన్!
తానుకర్తనని మదినిబొందుచును తల్లడిల్లుచున్నాడు సుమా! 27

గుణకర్మముల విభాగము తెలిసిన గుఱు తెఱిగిన సుజ్ఞాని యిలన్
గుణములు గుణములయందు లీనమై కూరిమి వర్తించుచు నుండున్
ఆత్మరూపుడగు దనకు వానితో నలరి బంధమెది లేదనుచున్!
అని మది దలచుచు గర్మలయందును నాసక్తియు మతి లేకుండున్! 28

ప్రకృతి గుణంబుల వ్యామోహితులై బన్నుగ దేహేంద్రియములనూ,
క్రియలయందు నాసక్తి జరించెడి కెరలునట్టి యల్పజ్ఞులనూ
ఆత్మజ్ఞుండగు జ్ఞాని యెప్పుడును నలరి చలింపగ జేయుచునూ!
కర్మలు మానగ జేయరాదుగా కౌంతేయా! గ్రహించుము మదిన్! 29

అర్జున వినుమా! సర్వకర్మముల నాధ్యాత్మంబగు చిత్తముతో
అర్పింపుము నాయందు భక్తితో నాకగాని మమకారంబున్
లేనివాడవై నిర్మలబుద్ధిని లీవలగ నిలుపుము రణమందున్! 30

ఏమనుజులు శ్రద్ధావంతులునై నించుక యసూయ లేకుండన్!
నా యీ యుపదేశమును నిత్యమును నయముగ పాలన సేయుదురో!
వారుగూడ యీకర్మబంధముల వడి ద్రెంపుదురిక కౌంతేయా! 31

అర్జున! నా యీ యభిప్రాయమును నాధ్యాత్మంబగు మార్గమునూ!
నిష్కామ:బగు కర్మయోగమును నిరసింతురొ గ్రహియింపకనూ!
అట్టివారినీ తెలియు మర్జునా! నల జ్ఞానవిహీనులవోలెన్!
చెడిపోయిన వారలుగ తెలిసికొను! స్థిరముగ వినుమా! కౌంతేయా! 32

జ్ఞానవంతుడైనను దగ బ్రకృతి జన్మాంతర సంస్కారమునన్
గలుగు స్వభావంబునకు ననుగుణము గలిగి బ్రవర్తించుచు నుండున్!
ప్రాణులన్నియును దమ ప్రకృతినే బన్నుగ నడుచుచు నుండు మఱిన్!
నిగ్రహ మది యిక యేమిజేయునూ నిర్మలమతి! యోచింపు మికన్! 33

ప్రతి యింద్రియమును దాని విషయమున బన్నుగ శబ్దాదుల యందున్!
రాగద్వేషము నిష్టాయిష్టము రహి యేర్పడి యున్నవిగాదా!
అట్టి రాగ ద్వేషములకు నెవ్వరు నిట్టె లోబడక యుండవలెన్!
అవి మానవునకు బ్రబల శత్రువులు ననుసరింపగూడదు వానిన్! 34

చక్కనున్న బరధర్మము కంటెను చిక్కని తనదు సుధర్మంబే
గుణము లేనిదైనను గూడను మఱి గురుతర శ్రేష్ఠంబైనదియున్!
మరణమైన నది శ్రేయస్కరమగు మానుగా తనదు సుధర్మమునన్!
బరధర్మం బది భయావహంబగు బాధాకరమగు మనుజునకున్! 35

అర్జునుం డిటుల బలికె శాంతమున నాసక్తిని గోవిందునితో
మనుజుడు బాపము జేయవలయునని మదిలో గోరక యుండిననూ!
దేనిచేత ప్రేరేపణ జెందును దేనిచేత ద్రోయంబడుచున్!
బలాత్కారముగ బాపముజేయుచు బతితుడగుచు నున్నాడు బెలన్! 36

శ్రీభగవానుడు వాసుదేవు డిటు శ్రీకరముగ కుంతీసుతుతో
మధుర వాక్యముల దేట తెల్లముగ మానసమున కింపుగ బలికెన్! 37

అర్జున నీవడిగిన యీ హేతువు నల్ల రజోగుణ ముద్భవమున్!
ఇదియే కామము వినుము వర్జునా! యిది యే క్రోధము నగుచుండున్!
ఈ కామంబది యెంత బొందినను నింతతృప్తియును బొందనిదీ!
మహాపాపములకును కారణమై మానుగ నిది మోక్షంబునకున్!
శత్రువుగా భావింపుమర్జునా! సావధానమున విను మిదియున్!
ధూమముచేతను నగ్ని మురికిచే దోరముగా మఱి యుద్దమునూ!
మావిచేత గర్భస్థశిశువునూ మానుగ గప్పగబడినటులన్!
ఆకామముచే నాత్మజ్ఞానమును నలరి గప్పబడి యుండుసఖా! 38

నిండింపగ శక్యముగా నిదియును, జండాగ్నికివలె బరితృప్తిన్
జెందనిదియునగు ఆశారూపము, స్థిరముగ జ్ఞానికి శత్రువునూ
ఈ కామముచే నాత్మజ్ఞానము నలరి గప్పబడి యుండుసఖా!
కావున కామమునకు దూరముగా గడగి యోగి వర్తింపవలెన్! 39

ఈ కామమునకు నాశ్రయంబు లవి యింద్రియములు మనసును బుద్ధీ!
చెప్పబడుచు నున్నవి కుంతీసుత! స్థిరముగ శాస్త్రంబుల చేతన్!
ఈ యింద్రియములచే నీ కామము నలరుచు నాత్మ సుజ్ఞానంబున్!
గప్పివైచి మనుజుని బహు బాధలు ంప్పలుబెట్టుచు నున్నదిగా! 40

భరతర్షభ! అర్జున! కావున వే! ప్రారంభంబున నీ వింకన్!
ఇంద్రియంబులను నిగ్రహింపుమా! యిమ్ముగ జ్ఞాన విజ్ఞానములన్!
రెండింటిని నాశమును జేయునది మొండి పాపరూపముగల యీ
కామంబును సంపూర్ణభావమున కడకు జేర్చుమా నశియింపన్! 41

ఈ దేహాదుల కంటె గూడనూ యింద్రియములు గొప్పని పార్థా!
ఇంద్రియముల కంటే బహు గొప్పది నింపుగ మనస్సు గౌంతేయా!
మనస్సు కంటెను బుద్ధి గొప్పదీ మహిని బుద్ధి కంటెను గూడన్!
గొప్పవాడెడొ వాడు యాత్మయని కూర్మిని పెద్దలు బలుకుదురూ! 42

మహావీర! అర్జున! విను మింకను మహనీయంబగు నీ యాత్మన్!
బుద్ధికంటె మఱి యతీతమైనది వొలుపగు నాత్మను దెలిసికొనీ
వివేకంబుతో గూడిన బుద్ధిన వికల మనస్సును నరికట్టీ!
దురాసదంబగు కామ రూపమును దూరము జేయుము బరంతపా! 43

ఈవిధముగ యీ కర్మయోగమును నిమ్మగ యా మధుసూదనుడున్!
ఆ అర్జునునకు నుపదేశించెను నలరి కురుక్షేత్రమునందున్!
అనుచుదెలిపి ధృతరాష్ట్ర భూపతికి నలసంజయుడును బ్రియమారన్!
తాను వినిన గాంచిన విషయంబుల దగ ముత్తియములను గ్రుచ్చినటుల్!

(కర్మయోగము సమాప్తం)

# శ్రీ భగవద్గీత

## జ్ఞాన యోగము

### నాల్గవ అధ్యాయము

శ్రీ భగవానుడు గోవిందుం డిటు శ్రీకరముగ పార్థుని తోడన్!
బలికె నిట్టులను బావయుక్తముగ భవ్య మనోహర వాక్య ములన్!
అర్జున వినుమా! నాశ రహితమగు యలరు కర్మయోగంబును నే
పూర్వమందు చూర్యునకు జెప్పితిని సూర్యుడు మనువునకును దెలిపెన్!
మనువును దెలిపెను నిక్ష్వాకునకును మానుగ యీ నిష్కామంబున్! 1

పరంపరముగా బ్రాప్తించిన యీ కర్మయోగమును రాజర్షుల్
తెలిసికొనిరి మఱి యాచరించిరీ దీరుగ బొందిరి మోక్షంబున్!
చాలకాల మిటు గడిచినందునను చయ్యన మఱి యా యోగంబున్!
ఈలోకంబున నదృశ్యమైనది యిల ప్రచారమున లేకుండెన్! 2

భక్తుండవు మఱి సఖుడవు గావున పరమ పురాతన మైనదియున్ !
నిష్కామంబగు కర్మయోగమును నేను మఱల దెలిపితి నీకున్ !
అట్టి యోగ మది మిగుల శ్రేష్ఠమును నాచరింప దగినది యనియున్ !
రహస్యమైనా యోగమనియునూ రహి నెఱుంగుమో కౌంతేయా! 3

అర్జునుడిటులను పలికె గృష్ణుతో నమతాక్షరములు దొలుకాడన్ !
ఇటీవలది నీ జన్మము కృష్ణా ! యింక వివస్వతు జన్మంబున్ !
బహు పురాతనంబైనది గాదా ? భానున కెటులను దెలిపితివీ !
యీ విషయము నే నెటుల గ్రహింతును వివరముగా దెలుపుము నాకున్! 4

భగవంతుండగు శ్రీకృష్ణుండును ఫలుకుతోడను బలికె నిటుల్ !
అర్జున ! వినుమా ! నీకును నాకును ననంత జన్మలు గడిచినవీ !
వాని నన్నిటిని నే నెఱుంగుదును వానిని నీ వెఱుగవు సఖుడా ! 5

అర్జున ! పుట్టుక లేనివాడ నే యవ్యయాత్ముడను కౌంతేయా !
సర్వభూతముల కీశ్వరుండ నే సర్వమందు నే నుండెదనూ !
స్వకీయ ప్రకృతి వశముజేసికొని స్వమాయ శక్తిని లోకమునన్ !
మఱల మఱల జన్మించుచుంటినీ ! మహిమాన్వితమగు రూపములన్ ! 6

ఎప్పుడెపుడు ధర్మము క్షీణించునొ యెప్పు డధర్మము వృద్ధియగున్ !
అప్పుడపుడు నే నవతరించెదను నత్యద్భుత రూపంబులతో !
నన్ను నేనె సృజయించుకొందునూ నయముగ దెలియుము నాచరితల్ ! 7

సాధుజనుల రక్షించుట కొఱకును సరగున దుర్మార్గులను నిలన్
వినాశమును నొనరించుట కొఱకును విమల ధర్మస్థాపన కొఱకై !
ప్రతి యుగంబునందున నర్జునా ! బన్నుగ జన్మించుచునుందున్ !
నన్ను నేనె సృజియించుకొందునూ నయముగ దెలియుము నాచరితల్ 8

దివ్యమైన నా జన్మ కర్మలను స్థిరముగ యధార్ధ తత్త్వంబున్ !
గ్రహించునో మఱి యట్టివాని కిక గలుగవు జననము మరణంబుల్ !
మరణానంతరమందు జన్మమును మఱల బొందకను కౌంతేయా !
మఱి నన్నే బొందును బరంబునూ మహిమాన్వితమగు మోక్షంబున్ ! 9

వీతరాగ భయ క్రోధంబుల నిల విడిచినట్టి సత్పురుషులునూ !
మనసుచేత నన్నాశ్రయించినా మహితాత్ములునగు వారలునూ
అనేకు లీ విధి జ్ఞాన దపస్సున యతి పవిత్రులై స్థిరముగనూ !
నా స్వరూపమును బొందిరి యర్జున! నయముగ మోక్షము నందుచునూ!10

ఎవరే విధముగ ననుభజింతురో యెవరే విధి సేవించెదరో !
వారి నా విధము నను గ్రహింతును వారి నా విధము దర్శింతున్ !
సర్వవిధములను నా మార్గమునే సంచరించెదరు నెల్లపుడున్ ! 11

కర్మంబుల ఫలప్రాప్తిని గోరెడి కాంక్షాపరు లీ లోకమునన్ !
దేవతలను వారాధించుచునూ దీక్షల బూనుచు నున్నారున్ !
కర్మంబుల ఫలసిద్ధి యీ జగతి గలుగుచు నున్నది శీఘ్రముగా !
ఏలయనగ యీ విధి జరుగుటకును నింపుగ గల దొక కారణమున్ ! 12

నాల్గు వర్ణములు సృజింపబడినవి నాచే నర్జున ! లోకమునన్ !
గుణకర్మంబుల విభాగములచే గూర్చితి నే నిటు చిత్రముగా
వానికి విను ! నే కర్తనైననూ వాస్తవముగ న న్నకర్తగన్ !
నాశరహితునిగ నిర్వికారునిగ నయముగ తెలియుము గౌంతేయా ! 13

కర్మము లంటవు ! నను కుంతీసుత ! కర్మ ఫలమునం దపేక్షయున్ !
లేరుసుమా ! మఱి యీ ప్రకారమున మది యెవ్వరు దెలియున నన్నున్ !
కర్మబంధములకును దూరముగా గడగి చనును మోక్షంబునకున్ ! 14

తాను నిజముగా గర్తగాదనియు దనకు కర్మఫల మందుననూ
అపేక్ష లేదని యీ ప్రకారముగ యా పరమేశ్వరు మార్గమునన్
పూర్వమెందఱో ముముక్షువులునూ ! పూని నిష్కామ కర్మలనూ !
నాచరించి యుండిరి కుంతీసుత ! యాచరింపు నీవును గూడన్ !
అట్టి పురాతనమైన మార్గమును ననుసరింపుమా ! కౌంతేయా ! 15

ఏది కర్మయో ! యేదకర్మయో ! యిది తెలియక బహు పండితులున్ !
మోహమందు జిక్కిరి భరతర్షభ ! మోదంబున నే నీకిపుడున్ !
అందువలన యా కర్మ రహస్యము జందముగా దెలుపుదు నీకున్ !
శుభకరమగు మోక్షమును బొందుమా ! సురుచిరముగ యది తెలిసికొని 16

శాస్త్రంబులచే విధింపబడినా స్థిరమగు కర్మల గూర్చియునూ !
నిషేధించినా వికర్మలను మఱి వివరముగా దెలియగ వలయున్ !
ఏమి జేయకను యూరకుండుటను నింపుగ యకర్మ గూర్చియునూ !
తెలిసికొనగవలయును బూర్ణముగా దీనుగ వాని స్వరూపములన్ !
ఏలయనగ యీ కర్మల గూర్చియు వాస్తవ తత్త్వము లోతుసుమా !
ఎఱుగుట కష్టము నెంతవారలకు నెఱుగుము దెలిపెద వాస్తవమున్ ! 17

కర్మమునందు నకర్మను గనునో కర్మగనునొ మఱి యకర్మలో !
మనుజులలోపల వివేకవంతుడు మఱియు యోగ యుక్తుండు నగున్ !
సకల కర్మలను నాచరించినా సాధుబురుషుడగు నాతండున్ ! 18

ఏ నరు సమస్త కర్మలన్నియును నిల కోరిక సంకల్పములున్ !
లేకయుండునొ, జ్ఞానాగ్నులచే లీలగ దహింపగా బడునో
అట్టి పురుషునీ బండితు డనుచును నలరుచు బేర్కొందురు విజ్ఞుల్ ! 19

కర్మఫలమునం దాసక్తియునూ; కడు నపేక్షయును విడనాడీ
సంతృప్తిని జెందుచు నిరంతరము సమాశ్రయింపక నెద్దానిన్ !
నిర్మలుడై యుండునొ నా పురుషుడు గర్మలందు వర్తించిననూ !
ఒకింతయైనను జేయని వాడే యొప్పుగ విముక్తు డాతండున్ ! 20

ఆశలేనివాడును, నింద్రియముల నలరి నిగ్రహించిన వాడున్
ఏ వస్తువునూ బరిగ్రహింపని యిల సంతుష్టుం డగువాడున్ !
శరీరమాత్రముజేత కర్మలను జేసిన పాపము నొందడుగా ! 21

అప్రయత్నముగ లభించుదానిని నలరి దృప్తి బొందెడువాడున్ !
సుఖదుఃఖాదుల ద్వంద్వభావములు సురుచిరముగ దాటినవాడున్ !
మాత్సర్యంబును లేనివాడునూ ! మఱి సమబుద్ధియు గలవాడున్ !
ప్రాప్తాప్రాప్తములందు సముండును బన్నుగ నిర్మల బురుషుండున్ !
బహు కర్మంబుల నాచరించినను బంధింపగబడ డితయునూ ! 22

సంగముక్తుడును జ్ఞానమునందున సరిగ మనసు నిలిపినవారున్ !
భగవత్ప్రీతిని భూతహితార్థము బన్నుగ ధర్మనిమిత్తమునన్
కర్మనాచరించెడి యా మనుజుని కర్మ యంతయును విలీనమై
జన్మబంధముల గలుగజేయకను కర్మ నశించును గౌంతేయా ! 23

యజ్ఞ హోమ సాధనములు మఱియును యజ్ఞ హోమ ద్రవ్యంబులునూ
హోమాగ్నియు మఱి హోమము జేసెడి హోత, జేయబడు హోమంబున్ !
అన్నియు బ్రహ్మస్వరూపంబనుచును బన్నుగ స్థిరమగు భావముతో !
అట్టి యజ్ఞ కర్మలను జేసెడి యా మనుజుడు బ్రహ్మమునందున్ !
నందగలడు, మఱి మోక్షపదంబును నందగలడు జిరశాంతియునూ ! 24

కొందఱు యోగులు దైవారాధన కూర్మి రూపమగు యజ్ఞమునే
అనుష్ఠించుచున్నారు అర్జునా ! యటులనె కొందఱు యోగులునూ !
జీవుని బ్రహ్మమునను గలుపుటకై జీవుని బ్రహ్మమను నగ్నిన్ !
హోమము జేయుచు నున్నవారుసుమ! యాహుతి జేయుచు నుండి రిటన్ 25

కొందఱు యోగులు జెవి మొదలైనా ఇంద్రియముల నిగ్రహ మనెడి
అగ్నులందు, మఱికొందఱు అర్జున ! మానుగ శబ్దాదులను మఱిన్
ఇంద్రియములు నను యగ్నులందునను నిమ్ముగ హోమము జేయుచునూ!
నున్నవారుసుమ ! అర్జున! వినుమా! యీ లోకమునకు యోగులునూ !26

సర్వేంద్రియముల కర్మలనన్నిటి సకలప్రాణముల చేష్టలనూ
మనోనిగ్రహంబను యోగంబున మఱి జ్ఞానముచే జతజేసీ
హోమము జేయుచు నున్నవారు సుమ ! దీమముగా కొందఱు యోగుల్ !
సమాధి యోగంబను నగ్నిని గదు సరసత జేసెడి వారలునూ ! 27

ద్రవ్య యజ్ఞమును దపో యజ్ఞమును, యోగ యజ్ఞమును మఱి యింకన్ !
స్వాధ్యయనంబను జ్ఞాన యజ్ఞమును సరసత జేయుచునుందు రిలన్!
వీరందఱునూ బ్రయత్నశీలురు విమల వ్రతంబులు గలవారున్! 28

ప్రాణాయామములందు దక్షులు ప్రాణాపాన గతులను వారున్
మార్గంబులను నిరోధము జేయుచు మఱి ప్రయత్న శీలతతోడన్!
అపానమందున ప్రాణవాయువును నపానమును బ్రాణమునందున్!
హోమము జేయుచు నున్నవారు సుమ! నీమముగా గొందఱు యోగుల్ !
పూరక కుంభక రేచకంబులను బొలుపుగ జేయుచు నున్నారున్! 29

మఱికొందఱు యోగులు విను మర్జున! మానుగ నియతాహారముతో
ప్రాణవాయువుల ప్రాణవాయువుల బన్నుగ నిలుపుచు నియమముతో
హోమము జేయుచు నున్నవారు సుమ! విమల భావమున నిశ్చలతన్!
వీరందఱు యజ్ఞ స్వభావమును విమలత దెలిపిన వారుసుమా!
యజ్ఞముచే బాపము నశించినా అమల పురుషులని దెలియుమికన్! 30

కురుసత్తమ! ఓ యర్జున! వినుమా! కూరిమి పై యజ్ఞంబులనూ!
ఆచరించి శేషించిన యట్టి యమృత రూపమగు నన్నమునూ!
భుజించునట్టి యోగిసత్తములు బొందుదు రా పరబ్రహ్మమునూ!
అట్టి యజ్ఞ మొకదానిని జేయని యట్టి వాని కిహమును లేదూ!
ఇక బరలోక సుఖంబు లెచ్చటా? యిక మోక్షం బెటులను గలుగున్! 31

పార్థా! యీ విధి బహు విధములగు బన్నుగ యజ్ఞము లన్నియునూ!
వేదములందున సవిస్తరముగా వివరింపగబడి యుండెగదా!
అవియన్నియు కర్మంబుల వలనను నలరి పుట్టినవిగా మదినీ
ఎఱుగుము! నర్జున! యిట్లెరిగినచో నిల విముక్తుడవు గాగలవూ! 32

ద్రవ్యమయంబగు యజ్ఞము కంటెను దగ జ్ఞానముతో గూడిన యా
యజ్ఞము శ్రేష్ఠము! నెఱుగుము బార్థా! యఖిల కర్మలను సర్వమునూ!
నాశనముగానిది యగుచు బరంతప! నయముగ యా యా కర్మలనూ
ఫలసహితముగా జ్ఞానమునందే బర్యవశించుచునున్నవిగా! 33

ఓ కౌంతేయా! యట్టి జ్ఞానమును నొప్పుగ తత్త్వము దెలిసిన యా
జ్ఞానులకును బ్రణిపాతము జేసియు వినయంబున బ్రశ్నించియునూ!
సేవజేసియును వారల వలనను స్థిరమున జ్ఞానము దెలియవలెన్!
ఆ జ్ఞానులునూ తప్పక నీకును నలరి దెలుపుదురు జ్ఞానమునూ! 34

దేనిని తెలిసిన యిట్టి మోహమును నిను బొందక యుండునా నింకన్!
మఱియు దేనిచే నశేష బ్రాణుల మఱి నీయందును నా యందున్!
చూడగలుగుదువా! అట్టి జ్ఞానమును శుభచింతన! యెఱుగుము నీవున్!
తత్త్వ దర్శనుల నుండి దెలిసికొనుదగ శ్రద్ధా భక్తుల తోడన్! 35

పాపాత్ముల యందధికంబైన మఱి యెన్నగ పాపము జేసినచో!
అట్టి బాప సంద్రమును జ్ఞాన మను నవరి తెప్పచే మఱి నీవున్!
దాటివేయగల వర్జున! వినుమా! దగ జ్ఞానం బట్టిది పార్థా! 36

ప్రజ్వలింపజేసిన హోమాగ్నియు భస్మము జేయునా సర్వంబున్!
ఆ విధముగనే జ్ఞానాగ్నియునూ యట్టి సర్వ కర్మంబులనూ!
భస్మ మొనర్చుచు నున్న దర్జునా! భవ్యమైన దీ జ్ఞానంబున్! 37

జ్ఞానము తోడను సదృశ్యమైనది యనయము బవిత్ర మైనదియున్!
ఈ లోకంబున లేదు సుమా! మఱి యిమ్ముగ యట్టి సుజ్ఞానంబున్
యోగసిద్ధులును కాలక్రమమునను దగ తమయందే స్వయముగనూ!
పొందుచున్నా వా రర్జున వినుమా! పొలుపుగ నీ సుజ్ఞానంబున్! 38

శ్రద్ధావంతుడు విజితేంద్రియుడును దదేకనిష్ఠయు గలవాడున్!
అట్టి మనుజుడును జ్ఞానము బొందును నాలస్యము మఱి లేకుండన్!
అట్టి జ్ఞానమును బొందినవాడై నా మనుజుడు బహుశీఘ్రముగన్!
పరమశాంతి బొందుచు కౌంతేయా! పరబ్రహ్మమును దా బొందున్! 39

జ్ఞానహీనుడును శ్రద్ధాహీనుడు సంశయచిత్తుడు నశియించున్
సంశయాత్మునకు నిహలోకంబున సరసత బరలోకంబుననూ!
సౌఖ్యంబనునది లేదు అర్జునా! సంశయంబు విడనాడు మికన్! 40

నిష్కామంబగు కర్మయోగమున నిఖిల కర్మ ఫలముల నన్నిన్
ఈశ్వరార్పణము నొనర్చువారును నిమ్ముగ జ్ఞానమహాత్మ్యముచే
సంశయములు విడనాడిన వాడును సకలాంతర్యామియు నగుచున్!
ఆత్మనిష్ఠడగు బ్రహ్మజ్ఞానిని యల కర్మలు బంధింపవుగా! 41

అందువలన ఓ కౌంతేయా! విను నజ్ఞానంబున బుట్టినదీ!
అలరి హృదయమున నున్నదియును నగు అర్జున! నీ వీ సంశయమున్ !
జ్ఞాన ఖడ్గమున ఖండిపుము వే యనుసరింపుమా! యాసక్తిన్!
నిష్కామంబగు కర్మ యోగమును నిశ్చలబుద్ధిని లెమ్మింకన్! 42

ఈ విధముగ ఖా జ్ఞాన యోగమును నిమ్ముగ యా మధుసూదనుడున్!
అర్జునునకు నుపదేశించెను మఱి నలరి కురుక్షేత్రము నందున్!
అనుచు జెప్పె ధృతరాష్ట్రి భూపతికి నల సంజయుడును బ్రియమారన్!
దాను వినిన గాంచిన విషయములను దగ ముత్తియములగ్రుచ్చినటుల్!43

(జ్ఞాన యోగము సమాప్తము)

ఓం

# శ్రీ భగవద్గీత

## కర్మ సన్యాస యోగము

### ఐదవ అధ్యాయము

అర్జునుం డిటుల బలికె వినయమున యా భగవంతుని గృష్ణునితో
అంజలి ఘటించి వినయముతోడను నాత్మ సంశయము దొలగింపన్!
కృష్ణా! నీ వొకసారి బలికెదవు గుదురుగ కర్మల త్యాగమునూ!
కర్మత్యాగ పూర్వకమగు జ్ఞానము గడు నుత్తమమని బలికెదవూ!
మఱి యొకప్పుడును గర్మయోగమును మంచిదనుచు బలుకుచు నీవున్!
సంశయమును గలిగించుచుంటివీ! సరిగ దెలుపు నీ రెండిటిలో!
ఏది శ్రేష్టమో విశదము సేయుము నింపుగ దెలుపుము నాకదానిన్!. 1

భగవానుండగు కృష్ణుడు బలికెను బల్లిదుడగు నా యర్జునుతో!
సంశయాత్ముడగు నర్జునుగాంచీ సరస వాక్యముల నిటు లనియెన్!
కర్మత్యాగమును, కర్మయోగమును గడు నిశ్శ్రేయసములను గదా!
పైరెండును సద్గతి గలిగించును బన్నుగ జేయగ ననురక్తిన్!
అయినప్పటికిని యర్జున! వినుమా! నలరు గర్మ త్యాగము కంటెన్
కర్మయోగమే శ్రేష్టంబైనది మర్మంబును దెలిపెద వినుమా! 2

కర్మయోగియగు వాడెన్నడునూ కాంక్షింపడుగా నెద్దానిన్!
ద్వేషింపడు నెవ్వానిని యర్జున దీరుగ నుండును నిశ్చలతన్!
రాగద్వేషములైన ద్వంద్వములు రహి నొదిలిన యా పురుషుండున్
సులభముగా సంసార బంధముల సురుచిరముగ నగు ముక్తుండున్! 3

జ్ఞాన యోగమును, కర్మయోగమును అనయము దలతురు నజ్ఞానుల్
వేలు వేఱనుచు ఫలములు వేఱని వికృత భావమున దలచుచునూ!

పండితులగు వా రా విధి దలపరు భవ్యమైన యా మార్గములన్!
నా రెండింటిని యొక్కదానినీ యాచరించుచో బురుషుండున్
రెండిటి ఫలమగు మోక్షసిద్ధినీ నిండుగ బొందుచు నున్నాడున్! 4

ఏ మోక్షంబును జ్ఞాన యోగులును నింపుగ బొందుచు నున్నారో!
ఆ మోక్షంబును కర్మయోగులును నలరి నొందుచును నున్నారున్!
జ్ఞానయోగమును కర్మయోగమును గనునో యొక్కటిగా మదిలో!
అతడే నిజముగ తెలిసినవాడును నతడే వివేక వంతుండున్! 5

కర్మసన్న్యాస రూపం బగు నా గడగిజ్ఞాన యోగముజేతన్
కర్మయోగ మది లేకుండును మఱి కష్టతరము బొందుట ముక్తిన్!
కర్మయోగి యగు మననశీలుడును గడు వేగమునను బ్రహ్మమునూ!
బొందును మోక్షము విను కౌంతేయా!బొలుపుగ జేయుము సత్కర్మల్! 6

నిష్కామంబగు కర్మయోగమును నిర్వర్తించెడి మానవుడున్!
విశుద్ధుండునూ, విజితాత్ముండును, విజితేంద్రియుడును నగువాడున్!
సర్వభూతముల నుండు నాత్మయును సరసత దన యాత్మయు గూడన్!
ఒకటేయని మది దలచినవాడును నొప్పుగ కర్మల జేసిననూ
ఆ కర్మలచే నంటబడడుగద యా పరిశుద్ధుడు నిజముగనూ! 7
తత్త్వవిదుండగు యోగ యుక్తు డిల దగ గనుచున్నను వినుచున్నన్!
వాసనలను దా జూచుచున్నను దాకుచున్న మఱి దినుచున్నన్!
నడచుచున్న మఱి నిదురించిననూ నయముగ యూపిరి విడిచిననూ!
మాటాడుచునున్నను కౌంతేయా! మఱియు విసర్జించుచు నున్నన్!
గ్రహించుచున్నను కనులను దెఱచీ కనులు మూయుచున్నప్పుడునూ!
ఇంద్రియములు నింద్రియ విషయంబుల నిల వర్తించుచు నున్నవనీ!
నిశ్చయించీ కర్తృత్వము లేకను నిర్మల చిత్తముతో నుండున్! 8-9
ఎవ్వడు దా జేసెడి కర్మంబుల సర్వము నీశ్వరు కర్పించీ!
సంగమమును విడి యనాసక్తితో సకలము జేయునో శుద్ధాత్మన్!
నీరములంటని తామరాకువలె నిర్మలుడగు నా కర్మిష్టిన్!
పాపములంటవు కౌంతేయా! మఱి బన్నుగ కర్మము లంటవుగా! 10

నిష్కాములునగు కర్మయోగులును నిర్మలాత్మ శుద్ధిని బొందన్ !
కామముజేతను మనస్సుజేతను గడగి బుద్ధిజేతను మఱియున్ !
అభిమానములేకను నింద్రియముల యా యా సమయము లందుననూ !
ఆ యా పనులను జేయుచుండెదరు నాత్మశుద్ధులగు యోగివరుల్ ! 11
యోగయుక్తుడగు గర్మయోగి యిల దగ కర్మంబుల ఫలములనూ !
విసర్జించి తన చిత్తశుద్ధితో విమలశాంతి గనుచున్నాడున్ !
అయుక్తుడగు వాడును గడునాశను నలరి ప్రేరితుండై మిగులన్
కర్మఫలములం దాసక్తుండై కర్మబద్ధుడగు చున్నాడున్ ! 12
జితేంద్రియుండగు దేహధారి యిల స్థిరమగుచిత్తము దోడుతనూ
సకల కర్మఫలములను ద్యజించి సకలము బ్రహ్మము గాంచునూ !
ఏమియు జేయని వాడై నాతడు నేమియు జేయింపనివాడై
నవద్వారంబులుగల నగరంబున నయముగ సుఖముగ నున్నాడున్ ! 13
భగవంతుడగు నాత్మ జీవులకు కర్తృత్వంబులగాని మఱిన్
కర్మంబులనుతోగాని కర్మఫల కామిత సంయోగంబులనూ !
గలుగగజేయడు మఱి యేమనినను కర్తృత్వాదుల బ్రకృతియే
గలుగ జేయుచున్నది బరంతపా ! ప్రకృతి సంబంధము జేతన్ !
గలిగిన జన్మాంతర సంస్కారము గలుగ జేయుచున్నది వినుమా ! 14
ఎవని బాపముల నా పరమాత్మయు నెవని సుకృతము లను నైనన్ !
స్వీకరింపడో బరంతపా ! విను స్థిరచిత్తముతో మదిగనుమా !
అజ్ఞానముచే బరను జ్ఞానమును నావృతమై యున్నది గానన్ !
అందుచేత జీవులు మోహంబును జెందుచునుండిరి చిత్తభ్రమన్ ! 15
ఆత్మజ్ఞానముచే నజ్ఞానము నలరి నశింపగ జేయబడున్ !
అట్టివారి జ్ఞానము సూర్యునివలె యలరి బ్రకాశించుచునుండున్ !
పరబ్రహ్మరూపముతో వెలుగుచు బ్రకాశించు చుండును బార్థా !
స్వస్వరూపయనుభవము దేహికిని గలుగజేయుచుండును వినుమా ! 16
బుద్ధి, మనస్సును, నిష్ఠయు గలిగీ పూర్ణముగా బరబ్రహ్మమునే
పరమగతిగ భావించెడి వారును బరమ బురుషులును నగువారున్ !

జ్ఞానముచే నిర్ధూతకల్మషులు బునర్జన్మ వర్జితమగు నా
శాశ్వత మోక్షము నందుచుందురూ! సర్వేశ్వరు మది దర్శించి ! 17
విద్యావినయము గల విప్రునిలో విమలమైన దేనువు నందున్ !
గజమునందునను, శునకము నందున నిజముగ చండాలుని యందున్ !
సమదృష్టియు గలవారే యర్జున! సమముగ జూచెడివారలనే !
ఆత్మానుభవంబు గలవారనుచును నలరి జ్ఞానులని బలుకబడున్ ! 18
ఎవని మనసు సమభావమునందున నింపుగ సమస్థితి యందుననూ !
స్థిరముగ నుండునో యట్టివారలే దిరముగ యీ జన్మమునందే !
జనన మరణ రూపంబగు బంధము సరగున ద్రెంపుదు రట్టిజనుల్
దోషరహితమైనది యా బ్రహ్మము దోరముగా సమమైనదియున్ !
అందువలన యాబ్రహ్మము నందే చందముగా నిలుతురు వారల్ ! 19
స్థిరబుద్ధియు మఱి మోహరహితుడును జిత్తము నా బ్రహ్మమునందున్ !
నిలిపినవాడగు బ్రహ్మజ్ఞానికి నిర్మల జిత్తుం డగువాడున్ !
ఇష్టమైన దానిని బొందిన మఱి తుష్టినిబొందడు నింతయినా !
అనిష్టమైనది తొంగిజూచినను నలరి దుఃఖమును నొంద డిలన్ ! 20

బాహ్యములగు శబ్దాది, విషయముల బన్నుగ నాశక్తియు లేకన్ !
ఆత్మసుఖమునం దలరుచు నాతడు నతిశయ సుఖముల దేలుచునూ !
బ్రహ్మనిష్టయను సమాధితోడుత ఫల్గుణ యాతడు గూడికొనీ !
అక్షయమగు శాశ్వత సుఖంబులను నాతడు బొందుచు నున్నాడున్ ! 21

ఇంద్రియ సంయోగమున గలిగెడీ యిల భోగము లవి యల్పములున్
దుఃఖహేతువులు యర్జున వినుమా !దూరముగా నుందురు విజ్ఞుల్ !
వానియందు గ్రీడింపరు బుధులును తగనొప్పగ జూపరు రక్తిన్ !
ఆసక్తియుజూపరు కౌంతేయా ! అల్పకాల సుఖముల కొఱకై ! 22

ఎవడీ తనువును నొదలకముందే యిచ్చోటనె యీ జన్మమునన్ !
కామక్రోధముల వేగము నాతడు గట్టడి జేయునో నిశ్చలతన్ !
అతడే యోగియు నతడే జ్ఞానియు నాతడె సుఖవంతుండగునూ !
చిత్తోపరతుం డాతడె పార్థా ! స్థిత ప్రజ్ఞుండగు నాతండున్ ! 23

ఎవడు నాత్మలో సుఖించుచును మఱి యెవడు నాత్మ గ్రీడించెడినో !
ఆత్మయందు జ్యోతిప్రకాశమును నలరి జూచుచుండెడివాడున్ !
అట్టి యోగి బ్రహ్మస్వరూపుడై నలరి బ్రహ్మసాక్షాత్కారంబున్ !
మోక్షముబొందును స్థితప్రజ్ఞుండై మోదమునను ముక్తిని బొందున్ ! 24
పాపరహితులును, సంశయరహితులు బన్నుగ సకలేంద్రియములనూ
స్వాధీనంబును బఱచుకొనిన యా సాధు బురుషులును నుత్తములున్ !
సర్వభూతహిత రతులగువారలు సర్వాతీంద్రియ జ్ఞానులునూ !
అట్టిఋషులు సాక్షాత్కారంబును నలరి మోక్షమును బొందుదురూ ! 25
కామ క్రోధములు లేనివారునూ గడు నిగ్రహమును గలవారున్ !
ఆత్మతత్త్వమును నెఱిగినవారును యత్నశీలురకు మోక్షంబున్ !
బ్రహ్మానందము గలుగుచున్నదీ బన్నుగ సంతత వెలయుచునూ !
శరీర మున్నపుడును లేనపుడును సర్వవేళలందును బార్థా ! 26
శబ్దాదుల బాహిరము చేయుచును చక్షువులను భూమధ్యమునన్
నిలుపుచు అర్జున ! నాశికాపుటము నిశ్చల ప్రాణాపానమున్
వాయువులను సమముగ జేసి మఱి మనోబుద్ధి యింద్రియములనూ !
నిగ్రహించి, యిచ్ఛా భయక్రోధము తిమ్ముగ లేకుండనుజేసీ
మోక్షాసక్తుండై దగయాత్మను ముదమున మననము జేసెడినో !
అట్టి పురుషుడెల్లపుడును ముక్తుడు నాత్మశాంతి మోక్షమునందున్ ! 27-28
యజ్ఞతపస్సుల భోక్తనుగా నను సలలోకంబుల యీశ్వరుగా !
ప్రభువనుగా మఱి శాసకుడనుగా ! బన్నుగ నను మది దలచుచునూ !
సమస్తజీవుల హితకారిగనూ ! సర్వము నే నని దెలిసికొనీ !
మది నన్నెఱుగుచు మననము సేయునో మనుజుడుశాంతినిబొందునికన్ ! 28
ఈవిధి కర్మసన్న్యాసలనియెడి నిమ్ముగ యోగము కృష్ణుండున్ !
అర్జునునకు నుపదేశించెను నలరి కురుక్షేత్రము నందున్ !
అనుచు దెలిపె ధృతరాష్ట్రభూపతికి నల సంజయుడును బ్రియమారన్ !
వానువినిన గాంచినవిషయములనుదగ ముత్తియనులను గూర్చినటుల్ ! 30

(కర్మసన్న్యాస యోగము సమాప్తము)

ఓం

# శ్రీ భగవద్గీత

## ఆత్మ సంయమన యోగము

### ఆఱవ అధ్యాయము

భగవంతుడగు కృష్ణుడు పలికెను పార్థునితో నీ విధముగనూ!
ఆత్మసంయమమున నను యోగంబును నమృతాక్షర సందోహమునన్ !
కర్మఫలము నాశింపక యెవ్వరు గార్యము జేయునొ నిరపేక్షన్ !
అతడె సన్న్యాసియు మఱి యోగియు నాతడె సిద్ధుడు కౌంతేయా !
అగ్నిహోత్రమును వదిలినవాడును నఖిలకర్మలను విడిచిన యా
అట్టి పురుష డెన్నటికి యోగియును నల సన్న్యాసియు గాదు సుమా ! 1

దేనిని సన్న్యాసంబని యందురో దానిని యోగం బనియెదరూ
పాండవ ! యీ విషయమును దెలిసికొను బన్నుగ యర్థంబయు క్తముగా !
ఏలయనగ సంకల్పంబులనూ యిమ్ముగ వదలని బురుషుండున్ !
యోగియు సన్న్యాసియు గానేరడు దగ యెంతయు యత్నించిననూ ! 2

జ్ఞాన యోగమన దెలియు మర్జునా! ధ్యాన యోగమని విశదముగా!
యోగంబును దా నందగోరినా దగ యామునికిని యోగికినీ!
కర్మ సాధనం బని శాస్త్రములను కౌంతేయా! దెలుపగను బడెన్!
యోగము బొందిన యోగికి సుపరతి కర్మ నివృత్తియె మార్గమనీ
శాస్త్రములందున దెలుపబడినదీ చక్కని రీతిని బరంతపా! 3

శబ్ద స్పర్శ విషయాదుల యందును సర్వ కర్మముల యందుననూ!
ఆసక్తింతయు లేక యుండునో యలరి సకల సంకల్పములన్
విడిచి పెట్టునో యట్టి మనుజుడే విమలత బొందిన వాడగునూ!
అట్టివాడె యోగారూఢుండని యలరి శాస్త్రముల దెలుపబడెన్! 4

ఉద్ధరించుకొన వలెను దనకు దా యొనర యధోగతి నుండియునూ!
దనకు దానుగా నందగూడదూ! తన దుశ్చేష్టితముల చేతన్!
ఇంద్రియములను జయించిన దనకును నింపుగ తానే బంధు వగున్!
ఇంద్రిముల నియమింపకున్నచో నిల శత్రువు దనకును దానే! 5

ఎవ్వడు మనసును వైరాగ్యంబున నిమ్ముగ స్వయముగ జయించునో!
అట్టి మనసు దనకును బంధువుగా నలరి జేయు హితమును నెపుడున్!
అట్టి మనసు నియమింప కున్నచో నిట్టి శత్రువగు బరంతపా!
అపకారంబును జేయుచు నుండును నుపకారం బింతయు లేకన్! 6

జితాత్ముండు మఱి ప్రశాంత చిత్తుడు స్థిర చిత్తము గూడిన వాడున్!
శీతోష్ణంబుల సుఖదుఃఖాదుల స్థిరముగ నుండును జెదరకనూ!
కీర్త్యపకీర్తుల యందు నాతనికి స్థిరముగ సమదృష్టియు నుండున్!
పరమాత్మానుభవంబు జెదరదూ బన్నుగ నాతని మనసుననూ! 7

శాస్త్రజ్ఞానము అనుభవజ్ఞానము బరితృప్తిని బొందిన వాడున్!
నిర్వికారుడును, విజితేంద్రియుడును నిర్మలచిత్తము గలవాడున్!
మట్టి గడ్డ, రాయిని, స్వర్ణంబును మఱి గాంచునో యొకటని మదిలో
అతడే యోగియు, యోగారూఢుడు ననుచు జెప్పబడు కౌంతేయా! 8

ప్రత్యుపకారము గోరక మేలును బన్నుగ జేసెడి వారలనూ!
ప్రత్యుపకారము గోరి సహాయము బరగ జేసెడీ వారలనూ!
శత్రువులందును బంధువులందును, సాధు బూరుషుల యందుననూ!
పాపులయందును సమభావంబును బన్నుగ యుండెడి మానవుడే!
శ్రేష్ఠుండనుచును జెప్పబడును మఱి జీవన్ముక్తుండును నగునూ! 9

ధ్యానయోగమున నుండు యోగి మఱి ధ్యానంబున యేకాంతమునన్!
మనసును మఱి సకలేంద్రియములనూ మఱి స్వాధీనము జేసికొనీ!
ఆశయించుకను లేనివాడునై యపరిగ్రహమును గలవాడై!
ఆత్మయందు మనసును నెలకొలిపి యలరుచుండవలె నెల్లపుడున్! 10

పరిశుద్ధంబగు ప్రదేశమందున బన్నుగ యెత్తును లేనిదియున్!
మఱియును గ్రిందుగ యుండనటులనూ మఱి యాసనమును యేర్పఱచి!
దానిపైని దర్భలును బరుపవలె దానిపైని యజనంబు మఱిన్
బరిశుభ్రంబగు వస్త్రము బఱచి బన్నుగ కదలక యుండునదీ!
అట్టి పీఠమున యాశీనుండై గట్టిగ యేకాగ్రత తోడన్!
ఇంద్రియ క్రియలన్నియు నరికట్టుచు నింపుగ స్వాధీనము జేసీ!
అంతఃకరణము బరిశుద్ధమునకు నా బరమాత్మను దలచుచునూ!
ధ్యాన మభ్యసింపగవలె నర్జున! శాశ్వత ముక్తిని సాధింపన్! 11-12

శరీరమును, శిరసును, గంఠంబును సమముగ తిన్నగ నిలుపుచునూ!
కదలక స్థిరముగ నున్నవాడునై కలగి దిక్కులను జూడకనూ
నాశికాగ్రమును వీక్షించుచు! నయముగ బ్రశాంత చిత్తుండై
నిర్భయ జేతస్కుండై యర్జున! నిర్మల వ్రత నిష్ఠుండగుచున్!
బ్రహ్మచర్యమును గలిగి మనస్సును బన్నుగ సంయమమును గలిగీ!
నాయందున జిత్తము గలవాడై నన్ను బరమ గతి యని నమ్మి!
సమాధిచిత్తుండై యుండగవలె సవ్యసాచి! విను ధ్యానమునన్! 13-14

నియత మానసుండై యోగియునూ! నిర్మలమతి యీ విధముననూ!
ఆత్మధ్యానము నందు నిలిపి మది యలరుచుండవలె నెల్లపుడున్!
నా స్వరూపమై నట్టిదియును మఱి నా యందున్నట్టిదియు మఱిన్!
మోక్షరూప మానంద రూపమగు ముదమున శాంతిని యతడొందున్! 15

అర్జున! విను మీ ధ్యానయోగమది యధికముగా దినువానికినీ!
బొత్తిగ దిననీ వానికి నర్జున! పొందుగ ప్రాప్తింపదు సుమ్మా!
అధికముగా నిద్రించువానికిని నల నిద్రింపని వానికినీ
ధ్యానయోగమది లభింపజాలదు ధ్యానయోగి గుర్తింపవలెన్! 16

మితమగు నాహారమును, విహారము, మిత బ్రవర్తనయు గర్మలనూ!
మితమగు నిద్రయు, జాగరణంబును మతిగల పూరుషునకును నిలన్!
ఈ యోగము సంసారబంధముల నిమ్ముగ సమసింపగ జేయున్!
జనన మరణ సంసార బంధముల సత్వరమున నిది బోగొట్టున్! 17

మనసు చక్కగా నిగ్రహింపబడి మఱి స్థిరముగ యాత్మను నిలుపున్!
సర్వ కామములు నిస్పృహుడగునో సదా శాంత చిత్తుండగునో
అపుడే యాతడు యోగసిద్ధినీ యలరి పొందినా వాడగుచున్!
సమాధియుక్తుం డనుచు జెప్పబడు సావధానమున విను మింకన్! 18

గాలిలేని యాప్రదేశ మందున గదలక దీపము నెటు లుండున్!
ఆ విధముగనే యాత్మ ధ్యానమున యలరు యోగి వశవర్తినియౌ!
చిత్తంబును భాసించు నర్జునా! చిరశాంతిని నిశ్చలముగనూ!
కావున యర్జున యోగి మనస్సును గాలిలేని చోటను వెలుగూ
దీపముగా వర్ణింపబడినదీ దృష్టాంతముగా దెలుపబడెన్! 19

యోగము జేతను నిగ్రహింపబడి దగ మనస్సు నిశ్చలముగనూ
పరమ శాంతి దగ బొందుచుండునో పరిశుద్ధంబగు మనస్సుతో!
ఆత్మను సందర్శించు చుండునో అట్టి యోగి మఱి తనయందే
ఆనందంబును బొందుచుండునో అట్టి స్థితిని యోగంబనుచున్!
ఆత్మైక్యంబును ననుచు దెలియుమా! యర్జున! విను! యీ యోగంబున్! 20

ఇంద్రియముల గోచరము గానిదియు నిజ నిర్మలమగు సమబుద్ధిన్
గ్రహింపబడ దగినదియును వర్జున! కడు నంతంబును లేని: యున్!
ఆనందంబును ననుభవించునో యలరి స్వానుభవమున నుండీ!
చలింపకుండునో యేమాత్రంబును బలుకుదు రది యోగం బనుచున్! 21

దేనిని బొందిన పిమ్మట యర్జున! యొనరగ యేలాభాదులనూ!
అంతకంతె ఘనమగు లాభముగా నలరి దలంపక యుండెడినో
దేనియందుగల మహా దుఃఖమును నించుకయును మది బెగలకనూ!
చలింపకుండునో స్థిరచిత్తుండై బలుకుదు రది యోగంబనుచున్! 22

లేశమైన దుఃఖము విషాదమును లేని స్థితిని యోగంబనుచున్!
ఆత్మైక్యము సాక్షాత్కారంబును నని యెఱుగగ వలయును బార్థా!
అట్టి యాత్మ సాక్షాత్కారంబును నట్టి రూపమగు యోగంబున్!
గలతబొందనీ ధీర మనస్సున గడు నమ్రత సాధింపవలెన్! 23

సంకల్పములను ప్రభవించెడి యా సర్వ కోరికల ద్యజియించీ
మనసుచేత సర్వేంద్రియములనూ! మఱి బాగుగ వశబఱచుకొనీ
ధైర్యముతో గూడిన బుద్ధిని మఱి దగ శాంతంబును గూడుకొనీ
మెల మెల్లగ మనసును మఱలించీ యల్లన యుపరతి బొందవలెన్!
బాహ్య ప్రపంచమునుండి మనస్సును భద్రముగా నాత్మను జేర్చి
ఆత్మేతరమగు దేనినిగూడదు నలరి దలపకను నుండవలెన్! 24-25

చపలస్వభావము నస్థిరమైనదీ క్షణము నిలకడయు లేనిదియున్!
అట్టి మనస్సును నెచ్చటెచ్చటను నిట్టె సంచరించుచు నుండున్!
అచట నచట దానిని మఱలించీ యాత్మయందు నిలుపగ వలయున్
ఆత్మకధీనము జేయగ వలయును యామనసును ఓ కౌంతేయా! 26

ప్రశాంతచిత్తుడు బ్రహ్మభూతుడు రజోగుణంబుల రహితుండున్!
దోషరహితుడగు ధ్యానయోగినీ సర్వోత్తమ శాశ్వతసుఖమున్!
ఆత్మానందము గలుగుచున్నదీ యాశ్చర్యము లేదింతయునూ!
శాస్త్రప్రసిద్ధము నిదియంతయునూ! సర్వేశ్వరు నాతరు బొందున్! 27

ఈ ప్రకారమున మనసునెల్లపుడు నింపుగ యాత్మను నిలుపుచునూ!
విగతకల్మషుండగు నా యోగియు విమలమైన బ్రహ్మనుబొందున్
బరమసుఖంబును నందు నర్జునా! భవ్య మార్గమును సులభముగా! 28

సమదర్శనుడగు యోగి యెల్లపుడు సకల చరాచర భూతములన్!
సమదృష్టిని గాంచును విను మర్జున! సకల భూతములయందు దనున్!
నున్నవానిగను, సకల భూతములు నున్నవానిగా దన యందున్!
జూచును నర్జున! సమ భావముతో జూచును బ్రాణుల దనకు వలెన్! 29

సకలభూతముల యందు జూచు నను సర్వేశ్వరునిగ భావించీ!
సకలభూతముల నాయందుననూ సంసత గాంచుచు నున్నాడో!
అట్టివారు నను జూచుచు నుండును నట్టివానినే గనుచుందున్! 30

సకలభూతముల యందునున్న నను సర్వము నొకటను భావమునన్!
అభేదబుద్ధిని యాత్మయొక్కటని యలరుచు భజించుచున్నాడో!
అటి యోగి యేవిధివర్తించిన గట్టిగ యుండును నాయందున్!
సమాధినిష్ఠను నున్నను లేకను సలుపుచున్న వ్యవహారములున్! 31
అర్జున! సమస్తప్రాణుల యందును నలరు సుఖము దుఃఖంబులనూ!
తనతో సమముగ బోల్చుకొనుచునూ! తనతో సమముగ భావించున్!
అట్టి యోగి శ్రేష్ఠుండని దలపుము! స్వర్జున దలపుము నాపలుకుల్! 32
గోవిందుని బలుకుల వినుచు నా కూర్మి బార్థుడిటులను పలికెన్!
సందేహంబును దీర్పవే యనుచు సరసత యంజలి ఘటియించీ!
మనోనిశ్చలత్వమునను గృష్ణా! మఱి సిద్ధించెడి యోగమునూ!
యుపదేశించితి! కాని నాకు మఱి యూహకందుటను లేదుగదా!
మనసుయొక్క స్థిరమైన నిలకడను మనసు నాదు జపలత్వముచే
తెలిసికొనగ జాలకయుంటి సఖా! తెలుపుము వివరముగా నాకున్! 33

మనసు చంచలంబైనది కృష్ణా! మఱి బలవంతంబైనదియున్!
విక్షోభంబును గలుగ జేయునది వికలము గలిగించుచు నుండున్!
కావున మనసు నిగ్రహించుటము గడగి గాలి యణచుట బోలెన్
మిగుల దుష్కరంబని నే దలచుచు మీరిన సందేహము నుంటిన్ 34

భగవంతుడగు కృష్ణుడు పలికెను బార్థునితో నీ విధముగనూ!
సందేహంబును దీర్చువాడునై సందీప్తంబగు వచనములన్!
సంశయ మేమియులేదు! అర్జునా! సరిగ బలికితివి నిక్కముగా!
మనసు నిగ్రహించుట బహుకష్టము మనసు చంచలం బైనదియున్!
అయినను నభ్యాసముజేతను మఱి యలరెడి వైరాగ్యము జేతన్!
మనసు నిగ్రహింపగబడగలదూ! మానుగ వినుమా! కౌంతేయా! 35

ఆత్మసంయమము లేనివానికిని యలరునట్టి యీ యోగంబున్
బొందశక్యమును గానిదనుచు నే బొందుగ మనసున దలచెదనూ!
వశ్యాత్ముండగు వానికి యోగము నొప్పుగ యత్నముజేసినచో
ఉపాయంబుచే బొంద దగినదని యొప్పుగ నే భావించెదనూ। 36

గోవిందు డా విధమున బలుకగ కూర్మి ఫల్గుణుం డిటులనియెన్!
సందేహంబును దీర్చుకొనంగను సావధానముగ బ్రశ్నించెన్!
శ్రద్ధావంతుడై నను గూడను సరి నిగ్రహశక్తియు లేకన్!
యోగసిద్ధినీ బొందజాలకను యోగమునుండి జారినచో!
ఎట్టిగతిని బొందును నాయోగియు నేమిజరుగు దెలుపుము కృష్ణా! 37

బ్రహ్మమార్గమున బయనించెడి యా బ్రాహ్మణుండు స్థిరమును లేకన్!
మూఢుడు యోగమునుండి జారుచును మొదముననను నిహపరములకున్!
జెడినవాడునై నశించునా మఱి చెదరిన మేఘము రీతిగనూ!
ఎట్టి గతిని బొందును నాతడు మఱి యేమగు నాతని యోగంబున్? 38

నా యీ సందేహమును బూర్తిగా నయముగ నామది తొలగింపన్!
నీవే దగుదువు! సమర్థుండవును నీవు దప్ప మఱి యెవ్వారున్!
దొలగింపగ జాలరు గోవిందా! దోరముగను దెలుపుము నాకున్! 39

శ్రీభగవానుడు కృష్ణుడు వలికెను స్థితచిత్తంబున ఫల్గుణుతో!
ప్రేమమీర సంబోధన జేయుచు బ్రీతితోని మధురాక్షరముల్!
అర్జున వినుమా! యోగభ్రష్టునకు నరసి జూడ గీడును లేదూ!
ఈ లోకంబున బరలోకంబున యిమ్ముగ వినాశమును లేదూ!
తండ్రీ! బాంధవ! మంచికార్యములు దగ జేసెడి వాడెవ్వరునూ!
దుర్గతులను ద్రెళ్ళరు కౌంతేయా! సద్గతులను నాతడు నొందున్! 40

యోగభ్రష్టుడును మరణము పిమ్మట దగ బుణ్యాత్ముల లోకంబున్!
బొందును వసించు ననంతకాలము బొలుపుగ సుఖంబులను గూడి!
తదుపరి బుట్టును సదాచారులగు దగ బరిశుద్ధులు నైనట్టి
శ్రీమంతులునగు దల్లి దండ్రులకు శీలవంతమగు గేహమునన్! 41

అటులగాక మఱి యోగి యైనచో నలరి జ్ఞానవంతులు నైనా
యోగుల వంశమునందు జనించును యోగి యగును బహు త్వరితగతిన్
ఈ ప్రకారమగు జన్మము జగతిని యిమ్ముగ బహు దుర్లభ మనుచున్!
దెలియు మర్జునా! నీ సందేహము దేటబఱతు నా వాక్యములన్! 42

అట్లాతడు యోగుల వంశంబున నలరుచు జన్మమునొందియునూ!
పౌర్వ దైహికంబైన బుద్ధితో బన్నుగ సంపర్కమునందీ!
అట్టి యోగ సంస్కారము వలనను నట్టి పూర్ణ యోగంబునకై
మఱల దీవ్రతర బ్రయత్నంబునూ మానుగ జేయుచు నున్నాడున్! 43

యోగ భ్రష్టుడును యోగాభ్యాసము నొనరగ జేయక యుండిననూ!
పూర్వజన్మ యభ్యాసబలముచే బొలుపుగ యోగమువైపునకే
యాకర్షబడుచు నున్నాడు అర్జునా! యిరువుగ యోగము నెఱుగంగన్
దలపుగలిగినా మాత్రము జేతను దగ వేదములను దెలిపిన యా
కర్మంబుల యనుష్ఠాన ఫలంబును మర్మముగా దాటుచుచుండున్! 44

పట్టుదలను యత్నించు యోగియును బాపరహితుడై నిశ్చలతన్!
అనేకజన్మల జేయబడిన యా అభ్యాసంబున యోగమునన్!
సిద్ధిని బొందిన వాడై బిమ్మట స్థిరచిత్తంబున నిర్మలుడై
సర్వోత్తమమగు బరమగతిని వే శాశ్వత శాంతిని దా బొందున్! 45

తపస్సు జేసెడి వారికంటెనూ దగ శ్రేష్ఠుడు యోగియు బార్థా!
జ్ఞానుల కంటెను యధికు డాతడును వినుమా! కర్మిష్ఠులకంటెన్
యోగి యధికుడని దెలియు మర్జునా! యోగివి నీవును గమ్మికనూ! 46

ఆ యోగులలో మఱి నా యందున అలర్శ్రద్ధ మనసును నిలిపీ!
ధ్యానించుచు నుండునొ యెల్లపుడును దగ యోగంబును గూడికొనీ
అట్టివాడు శ్రేష్ఠుండని దలతును అట్టి యోగి నా కిష్టుండున్! 47

ఇట్టి యాత్మ సంయమ యోగంబును నింపుగ నా మధుసూదనుడున్
అర్జునునకు నుపదేశించెను మఱి నలరి కురుక్షేత్రము నందున్!
అనుచు దెలిపె ధృతరాష్ట్రభూపతికి నల సంజయుడును బ్రియమారన్
దాను వినిన గాంచిన విషయములను దగ ముత్తియములను గూర్చినట్లుల్

(ఆత్మ సంయమయోగము – సమాప్తము)

ఓం

# శ్రీ భగవద్గీత

## విజ్ఞానయోగము

### ఏడవ అధ్యాయము

శ్రీ భగవానుడు గృష్ణదేవుడును శ్రీకరముగ యా బార్థునకున్!
విజ్ఞానంబను యోగము దెలిపెను వివరముగా నీ విధముగనూ!
నాయందున నీ మనసును నిలిపి నన్నే యాశ్రయమును బొందీ!
యోగాభ్యాసము జేయుచు బార్థా! దగ సంపూర్ణముగా నన్నున్
నెట్లు దెలిసికొందువా యా పద్ధతి యింపుగ దెలిపెద కౌంతేయా! 1

దేనిని దెలిసిన యీ ప్రపంచమున తెలియదగినది మఱియొకటీ
మిగిలియుండదో యట్టి విషయమును దగ దెలిపెద విను! విశదముగా!
అనుభవ సహితంబగు జ్ఞానంబును నాత్మవిషయమును బూర్ణముగన్ 2

వేలకొలది మనుజులలో నొక్కడు విమల మోక్షమును సాధింపన్
యత్నించుచునున్నాడు నర్జునా! యతిశయ భక్తిని గూడికొనీ!
అట్టివారిలో నొక్కరు మాత్రము నలరి నన్ను వాస్తవముగనూ
తెలియగలుగుచున్నాడు అర్జునా! తెలియుము నీవును వాస్తవమున్! 3

భూమి జలము నగ్నియు వాయువునూ పౌలుపుగ యాకాశము మనసున్
బుద్ధి యహంకారములు యెనిమిదిగ సిద్ధముగా విభజింపబడెన్!
నా యీ ప్రకృతి మాయ యనుచునూ నయముగ దెలియుము బరంతపా 4

అర్జున విను! ఈ అపరా ప్రకృతి యల్పంబైనదిగా నెఱుగూ!
దీనికంటె వేరైనది మఱియును దివ్యమైన దొకటియు గలదూ!
ఈ జగత్తునంతను ధరించునది యిలను జీవ భూతంబైనా
మఱియొక బ్రకృతి పరా ప్రకృతియని మానుగ దలపుము శ్రేష్ఠమనీ! 5

జడచేతనములు, సకల భూతములు సర్వము నీ రెండిటి వలనన్
పరాపరా ప్రకృతుల వలననే సకలము గలుగును దెలియు మికన్
ఈ రెండిటి ప్రకృతుల వలననే యీ ప్రపంచమున కంతటికిన్!
ప్రభవ ప్రళయముల గారణుండనై బన్నుగ నుంటిని ధనంజయా! 6

అర్జున! విను! నా కంటెను వేఱుగ మరియొక్కటి యిల లేదు సుమా!
సూత్రమునను మణులకువలె నాలో సురుచిరముగ యీ లోకములున్!
నాలో గూర్పగ బడె కుంతీ సుత! నయముగ హారమునకు వోలెన్ 7

జలమునందు నే రుచిని పాండవా! చంద్ర సూర్యులా కాంతియు నే!
సర్వవేదముల గల ప్రణవంబును శబ్దంబును గగనంబున నే
మనుజునందు పౌరుషమును నేనే మానుగ దెలియుము పరంతపా! 8

మఱియు దెలియుమా! కుంతీనందన! మానుగ నా రూపంబులనూ!
పృథివి యందు నే పుణ్యగంధమును విభావసుని దేజస్సును నే!
సర్వభూతముల ప్రాణంబును నే సకల దాపసుల దపసును నే
ఆ రూపంబుల నున్నవాడ! విను! నరయుము నర్జున యారీతిన్! 9

సర్వభూతముల బీజముగా నను సనాతనునిగా దెలియు మికన్!
మఱియు బుద్ధిమంతుల బుద్ధియు నే మఱి దేజస్వుల దేజము నే!
ఆ విధముగ నను దెలియు మర్జునా! యలరు నాదు నస్థిత్వంబున్! 10

కామ రాగ వర్జితములు నైనా కడు బలవంతుల బలమును నే
ధర్మమునకు వ్యతిరేకముగానీ కామంబును నే ప్రాణులలో!
ఆ విధముగ నను దెలియు మర్జునా! యలరు నాదు నస్థిత్వంబున్! 11

స త్త్వము, రజస్సు, త మో గుణములను సరసత గలుగు స్వభావములున్
ఏవి గలవో యవి నా కారణమున నిమ్ముగ గలిగెను ధనంజయా!
అయితే! పాండవ! వాని యందునను నలరి నేను లేననుచు మదిన్
దలపుము! నవి నా యందు నున్నవి దగవశమై వర్తించుచునూ! 12

మూడు విధములగు గుణవికారముల మూలస్వభావంబులచేతన్!
ఈ ప్రపంచ మంతయును మోహమున నిమ్ముగ బొందింపగ బడియెన్!
అట్టి త్రిగుణముల కంటెను వేరై యతీతుండనగు నన్ను మదిన్
దెలిసికొనక యున్నది కౌంతేయా! దీరుగ శాశ్వితుడను నన్నున్! 13

ఏలయనగ విను! నలౌకికంబును దైవీ సంబంధమునైనా
త్రిగుణాత్మకమగు నా యీ ప్రకృతి దీరుగ దాటుట గష్టమగున్!
ఎవ్వరు నను మది యాశ్రయింతురో యెవ్వరు శరణము నందుదురో!
వారీ ప్రకృతి దాటి వేయుదురు వారీ మాయను దరింతురూ! 14

దుష్కృతులును మఱి మూఢాత్ములునూ దుర్గుణంబులును గలవారున్!
మాయచేత మఱి యపహృతజ్ఞానులు నసుర స్వభావము గలవారున్!
అట్టి నరాధములును గౌంతేయా! యాశ్రయించుటయు లేదు ననున్!
ఎట్లు బొందుదురు నీశ్వరభక్తిని యే విధముగ బొందుదురు ననున్! 15

భరతర్షభ విను! నాల్గు విధములగు భవ్యాత్ములు పుణ్యాత్ములునూ!
భక్తితోని సేవించుచున్న యా భవ్యాత్ముల దెలియుము పార్థా!
ఆర్తులు, జిజ్ఞాసువులు మఱియునూ యర్థము గోరెడి వారలునూ!
ఆత్మ జ్ఞానము గల పురుషుండును నలరి భజించుచు నున్నారున్! 16

అట్టి వారిలో జ్ఞాని శ్రేష్ఠుడని యలరి దెలుపుచును నున్నాడన్
గూడియుండు నిత్యము బరమాత్మను గూడి యుండు నిశ్చల భక్తిన్!
అట్టి జ్ఞానియే కురునందన! విను నలరి శ్రేష్ఠుడగు చున్నాడున్!
అట్టి జ్ఞానికిని నే నిష్టుండను నాతడు మఱి నా కిష్టుండున్! 17

పైని జెప్పినా భక్తులందఱును బన్నుగ యుదారులే గానీ!
అందు జ్ఞాని సాక్షాత్తుగ నేనని యలరి దెలుపుచున్నాడను నే!
అతడు నన్ను జిత్తమున నిలిపికొని యలరి జూచుచున్నాడు సదా!
నన్నే యుత్తమ ప్రాప్యస్థానమని నను నాశ్రయించుచున్నాడున్! 18

బహు జన్మల యంతమున మనుజుడును భవ్య జ్ఞానవంతుండునునై
వాసుదేవుడనుచును సమస్తమును వలనొప్పగ మది గాంచుచునూ!
నన్ను బొందుచున్నాదు అర్జునా! నయముగ సర్వము నర్పించీ!
అట్టి మహాత్ముడు సుదుర్లభుడు గద! గట్టిగ నాతడు నను బొందున్! 19

విషయాదుల గోరికల జేత మఱి విగత జ్ఞానులై కొందఱునూ!
తమ తమ ప్రకృతి ననుసరించియును దగ జన్మాంతర సంస్కృతినీ!
ఆ యా విషయము లవలంబించుచు నారాధనలను జేయుచునూ!
అన్య దేవతల గొలుచుచుండిరీ యాశల ద్యజింపకను వారున్! 20

ఏ యే భక్తుడు నే యే దేవత యే రూపంబున బూజించున్
ఎట్టి శ్రద్ధ నర్చించుచుండునో యట్టి శ్రద్ధనే వానికినీ!
స్థిరమగు భక్తిని గలుగజేయుచును గరుణను గాపాడుచు నుంటిన్!
నిర్లక్ష్యము జేయకను వానికిని నిత్య సుఖములను గూర్చుచునూ! 21

పైని దెలిపినా కామ్య భక్తుడును బహు శ్రద్ధను భక్తిని గూడీ
ఆ యా దేవతలను నర్చించుచు నలరి భజించుచు నున్నాడున్!
మఱియును నాచే విధింపబడు నా మానుగ యిష్ట ఫలంబులనూ!
అట్టి దేవతలనుండి బొందునూ యా యా ఫలముల నాతడునూ! 22

అల్ప మేధసులు నల్ప ఫలంబులు నలరి బొందుచుందురు వారున్!
నాశవంతమైనవి యా ఫలములు నయముగ యంతంబైనవియున్!
దేవతలను బూజించువారు నల దేవతలను బొందుదు రింకన్
మద్భక్తులు నన్నే బొందుదురూ నయముగ శాశ్వత మోక్షంబున్! 23

అవ్యక్తంబును, నాశ రహితమును నలరి ప్రకృతికి బరమగుచున్!
అట్టి నన్ను అవివేకులు గొందఱు నరయక నాదు స్వరూపమునూ
పాంచ భౌతికంబగు దేహంబును బన్నుగ బొందిన వానిగనూ!
మది దలంచుచున్నారు నర్జునా! మానుగ నను దెలియగ లేకన్! 24

యోగమాయచే సమావృతడ నగు నను జూడగ లేరందఱునూ!
అజు నవ్యయునిగ శాంతిదాతగా నఖిల భూతముల నుందుననీ!
అవివేకులు నగు నీ జనులందఱు నరసి తెలిసికొన జాలరుగా! 25

భూత భవిష్య ద్వర్తమానములు భూతములన్నిటి నెఱుగుదునూ!
నన్ను మాత్ర మెఱుగరు యెవ్వరునూ నయముగ వినుమా! కౌంతేయా! 26

సర్వభూతములు బుట్టుకతోడనె సరగున రాగ ద్వేషములన్!
సుఖ దుఃఖాదుల ద్వంద్వ మోహమున శోషిలుచుండును బరంతపా!
ఆ విధమున వ్యామోహము నందున యజ్ఞానము బొందుచు నుండున్! 27

పుణ్య కార్యతత్పరులగు బురుషుల పూర్తి బాపమును నశించునో!
అట్టి వారు సుఖ దుఃఖాదులనే నిట్టి ద్వంద్వ రూపంబులగూ!
అజ్ఞానంబును దొలగినవారై యలరుచు దృఢవ్రతులై నన్నున్
సేవించుచు నున్నారు అర్జునా! స్థిర భక్తిని నను బొందగనూ! 28

జరా మరణములు ద్యజించుటకునై సరగున నా యాశ్రయ మందే!
ఏ పురుషులు యత్నము నిరంతరము నింపుగ జేయుచు నున్నారో!
సకల ప్రత్యగాత్మ స్వరూపమును సకల కర్మలును బ్రహ్మమనీ!
ఆ పురుషులు గ్రహియింతురు నర్జున!యటుల నీవు గ్రహియింపు మదిన్! 29

అధి భూతంబును, నధి దైవంబును, నధి యజ్ఞములను గూడికొనీ!
యున్న నన్ను ఏ నరులు గ్రహింతురో బన్నుగ మరణము నందుననూ!
నిర్మల మనస్సు గలిగినవారై నిజముగ నను దెలియగ గలరూ!
మనో నిగ్రహము గలవారగుచును మదిని నన్ను స్మరియించెదరూ! 30

'ఈః విధి విజ్ఞానం బను యోగము నింపుగ యామధుసూదనుదున్
అర్జునునకు నుపదేశించెను మఱి యలరి కురుక్షేత్రము నందున్'
అనుచు దెలిపె ధృతరాష్ట్రి పిభునకును నల సంజయుడును బ్రియమారన్
దాను వినిన గాంచిన విషయములను దగ ముత్తియములను గూర్చి నటుల్!

(విజ్ఞాన యోగము-సమాప్తము)

ఓం

# శ్రీ భగవద్గీత

## అక్షర పరబ్రహ్మ యోగము

### ఎనిమిదవ అధ్యాయము

పరమాత్ముండగు శ్రీకృష్ణునితో ఫల్గుణు డిట్టుల బ్రశ్నించెన్!
అతి వినయముతో నంజలి ఘటించి యత్యాసక్తిని విషయమునన్!
పరమ పురుష! శ్రీకృష్ణా! దెలుపుము బన్నుగ బ్రహ్మం బన నేమో?
అధ్యాత్మంబనగా నెయ్యదియో? యలరి కర్మ మనగా నేమో!
అధిభూతంబని యేది తెలుపబడె? యధి దైవంబనగా యేమీ? 1

ఓ మధుసూదన! దేహమునందున యొప్పుగ యధి యజ్ఞుండెవడూ?
ఆ యధి యజ్ఞుని గనుగొను టెట్టుల యలరి దెలిసికొనుటయు నెట్లున్?
ప్రాణప్రయాణపు సమయమునందున బన్నుగ నియమిత చిత్తులచే
ఎట్లు దెలిసికొన బడగలవో మఱి నింపుగ దెలుపుము విశదముగా! 2
భగవానుండగు కృష్ణుడు పలికెను బన్నుగ కుంతీ సుతుతోడన్!
మధుర వాక్యముల మంజుల ఫణితిని మది సందేహము దొలగునటుల్!
సర్వోత్తమమును నాశరహితమును సవ్యసాచి! బ్రహ్మంబనుచున్!
దెలుపబడును మఱి ప్రత్యగాత్మనూ! దెలుపబడును నాధ్యాత్మమనీ!
ప్రాణికోటి నుత్పత్తి జేసెడీ బన్నుగ యజ్ఞ స్వరూపమునూ
త్యాగ పూర్వకంబగు నా క్రియనూ దగ కర్మమనీ తెలుపబడెన్! 3
అర్జున! యలరి నశించు పదార్థము నధి భూతంబని దెలుపబడున్!
విరాట్పురుషుడే హిరణ్యగర్భుడు నధిదైవతమని యనబడునూ!
ఈః దేహంబున యధి యజ్ఞుండను నింపుగ నేనే కౌంతేయా!
ఆ పరమాత్మయె యలరి యుండునూ యఖిల దేహముల యందుననూ! 4

ఎవడు మరణకాలము నందుననూ యిమ్ముగ నన్ను స్మరించుచునూ
యీ శరీరమును బరిత్యజించునో యిట సందియ మింతయులేదూ!
ఆతడు నాదు స్వరూపము నందును నను బొందును నిశ్చయముగనూ!
జనన మరణ బంధముల దొలగుచును జాగృతి నందును మోక్షమునన్! 5

ఎవడు మరణ కాలమున యర్జునా! యే భావంబును రూపంబున్!
జింతించుచు దేహము ద్యజించునొ స్థిర భావంబుల స్మరణముచే!
గలిగిన సంస్కారముల బలిమిచే గమనీయంబగు భావములన్
విమలమైన యా రూపంబులనే వేడుక నందుచు నున్నాడున్! 6

కావున యర్జున! యెల్ల కాలముల గలతలేక నను స్మరించుచున్!
నీ స్వధర్మమగు యుద్ధము గూడను నిర్మలబుద్ధిని జేయుమికన్!
ఈ విధముగ నీ మనోబుద్ధులను నింపుగ యర్పించిన భక్తిన్!
నీవు నన్ను బొందెదవు! అర్జునా! నిజ మిట సంశయయును లేదూ! 7

అభ్యాసంబున యోగ యుక్తమై యలరు చుండెడిదియును మఱియున్!
అన్య విషయముల పైకి పోనిదియు నట్టి మనస్సున మనుజుండున్!
అప్రాకృతుడును స్వయంప్రకాశుడు నా సర్వోత్తముడగు దివ్యున్!
మఱల మఱల స్మరియించుచు భక్తుడు మానుగ యాతని బొందుసుమా! 8

సర్వజ్ఞుండును బురాణ పురుషుడు సకల ప్రపంచ నియామకుడున్!
సూక్ష్మమైన వాడును, నణువుకువలె సురుచిరముగ సంరక్షకుడున్!
సర్వజగతి కాధారభూతుడును సాక్షాత్ యచింత్యరూపుడునూ
సూర్యునికిని వలె స్వయంప్రకాశుడు శుద్ధ జ్ఞాన స్వరూపుండున్!
అట్టి వాడునగు నా పరమాత్మను ననంత నిశ్చల భావముచే
అంత్యకాలమున యోగ బలంబున యలరి ప్రాణవాయువుల మఱిన్!
భ్రూమధ్యంబున నిలిపిన వాడై బులకితుడై భక్తుడు యున్నన్!
దివ్యరూపుడగు బురుషోత్తమునీ భవ్యరూపమున లీనమగున్! 9-10

దేనిని వినాశ రహితమైనదని దివ్యవాక్కులను వేదవిదుల్
దెలుపుచుండిరో; రాగరహితులును దీరుగ జితేంద్రియులు మఱియున్!
దేనియందునను బ్రవేశించుచును, స్థిరముగ శాంతిని నొందుదురో!
దేని నభిలషించుచు మునులందఱు దివ్య బ్రహ్మచర్యంబు మదిన్!
ఆచరించుచున్నారో! అర్జున! యా పరమాత్మను దెలిపెదనూ!
ఆ పదమును సంక్షేపముగా విను! నర్జున! బహు శ్రద్ధాభక్తిన్! 11
ఇంద్రియ ద్వారంబుల నరికట్టుచు నింపుగ మనసును హృదయమునన్!
ఆత్మయందు బాగుగ స్థాపించి! యలరి బ్రహ్మరంధ్రంబుననూ!
ప్రాణవాయువుల నుంచి బాగుగా బ్రపరబ్రహ్మవాచకమును నౌ
ఆత్మను గూర్చిన యేకాగ్రతతో నలరి యోగ ధారణతోడన్!
'ఓమ్'యను నక్షర ముచ్చరించుచును నొప్పుగ నను జింతించుచునూ!
శరీరంబు ద్యజియించునా నాతడు సర్వోత్తమ స్థానము నందున్! 12-13
అర్జున వినుమా! యలరుచు భక్తిని యలరి నాదు వాక్యంబులనూ!
అనన్య చేతనుడై సతతంబును నలరి స్మరించునా ననె పుడున్!
అట్టి నిరంతర ధ్యానపరునకును అర్జున! నేనతి సులభుండన్!
సులభముగా నొందగబడుచుండును! జోద్యము గాదిది నిక్కువమున్! 14
సర్వోత్తమపుగు మోక్షపదంబును సత్పురుషులు బొందినవారై!
మఱల దుఃఖనిలయంబైనదియును మానుగ యనిత్య మైనదియున్!
బునర్జన్మ యెన్నటికిని బొందరు బొలుపుగ నాదు గృపామహిమన్!
జనన మరణబంధముల దొలగుదురు శాంతిని గందురు కౌంతేయా! 15
బ్రహ్మలోకముల వఱకును గల యీ బన్నుగ లోకము లన్నియునూ
పునరావృత్తిని గలుగజేయునూ పూర్ణములో గలుపదు వారిన్!
ఆ లోకములను బొందిన వారలు నలరి జన్మముల నెత్తుదురూ!
ననుబొందిన వారికి గుంతీసుత! నయముగ మఱి జన్మములేదూ! 16
సహస్రయుగ పర్యంత మే జనులు సరసత బ్రహ్మకు దినమగునూ!
అట్లే రాత్రిని సహస్రయుగముల నలరు కాలమని దలచెదరో!
అట్టివాడు నీ యహోరాత్రముల యట్టి కాలమును గణియించి!
తత్త్వము దెలిపిన వారగుదురు సుమ! దగ యంతరమును దెలిసికొని! 17

బ్రహ్మ పగలు ప్రారంభమగునపుడు బన్నుగ యవ్యక్తము నుండీ!
సకల చరాచర వస్తువులన్నియు సర్వము బుట్టును నున్నవిగా!
మఱల రాత్రి ప్రారంభ కాలమున మానుగ యవ్యక్తమునందే
లీనమగుచు నున్నవి. కౌంతేయా! లీలగ యీ ప్రకృతి యందున్! 18

పూర్వకల్పమున యందలి యాయా పొలుపుగ ప్రాణి సమూహంబున్!
కర్మవశమునై పుట్టుచుబుట్టుపు బ్రహ్మ రాత్రి ప్రారంభమునన్
విలయమొందుచును నున్నది మఱలను వేగ బ్రహ్మ దేవుని బగటిన్!
ప్రారంభంబున బుట్టుచున్నదీ ప్రాణి కర్మ యాధీనంబై! 19

పరమాత్మా! యని యనబడు వస్తువు అవ్యక్తము ప్రకృతికంటెన్!
వేరైనదియు యుత్తమమైనది, విమల సనాతన మైనదియున్!
ఇంద్రియములకును వ్యక్తముగానిది యిలలో సమస్త ప్రాణులునూ!
నశించినను నది నశింపకుండును నయముగ దెలియుము గౌంతేయా! 20

ఏ పరమాత్మ యనగో చరుండనియు నిమ్ముగ యవినాశియు ననుచున్
తెలుపబడెనో నాతనినే పార్థా! దీరుగ సర్వోత్తమమైనా!
ప్రాప్తస్థానముగ వేదవేత్తలును నుబ్బుగ దెలుపుచు నున్నారో
దేనిని బొందినచో నాతడుమరి దిరిగి జనింపడొ లోకమునన్!
అట్టిది సుమ! నా పరమధామమును నట్టిది సుమ! నా స్వరూపమున్! 21

ఎవని యందు నీ ప్రాణికోటియును నింపుగ నివసించుచు నుండున్!
ఎవని యందు నీ సర్వజగంబును నింపుగ లీనంబైయుండున్!
అట్టి పరమ పురుషుడు బరమాత్మను అనన్యమగు శ్రద్ధా భక్తిన్
అచంచలంబగు యోగముజేతను నా మనుజుడు బొందును వేగన్! 22

ఏ కాలంబున యే మార్గంబున యింపుగ శరీరమును విడిచీ!
వెడలిన యోగులు జన్మమునందరొ యిలకు రాక యుందురొ మఱలన్!
ఏ కాలంబున వెడలిన యోగులు నిలపై జన్మము నందుదురో!
ఆ యా కాల విశేషంబులనిక నాలకింపు నే దెలిపెదనూ! 23

అగ్ని! ప్రకాశము! శుక్లపక్షమును నలరు పగటి కాలమునందున్!
ఆఱునెలల యా యుత్తరాయణము నవి మే మార్గమునను గలవో.
ఆ మార్గంబున వెడలినట్టి యా యలరు బ్రహ్మ వేత్తలు వేగన్!
ఆ బ్రహ్మంబును బొందుదు రర్జున! యతిశయోక్తి లేదింతైనా! 24

ధూమము రాత్రియు, కృష్ణపక్షమును నేమముగా మాసములాఱున్!
దక్షిణాయనము నే మార్గమునను దగ గలవో! యా మార్గమునన్!
వెడలిన సకామ కర్మయోగియును విమల చంద్ర సంబంధమునన్!
బ్రకాశమందుచు మఱల వెనుకకును మఱలివచ్చు చున్నారు గదా! 25

శుక్ల కృష్ణ బక్షములు రెండునూ సురుచిరముగ లోకమునందునన్!
శాశ్వతంబుగా నుండెడి వనుచును శాస్త్రవిదులు దలతురు గానన్!
ఒక్కదానిచే జన్మ రహితమును నొప్పుగ రెండవ మార్గముచే
మఱల జన్మమును నొందుచు నుండును మానుగ యోగియు నీ విధమున్!
26

రెండు మార్గముల యెఱిగిన యోగియు మెండుగ బొందడు మోహంబున్!
కావున బార్థా! యెల్లకాలమును దైవయోగ యుక్తుడ వగుమా! 27

యోగియైన వా డీ యధ్యాయము దగ తత్త్వంబును దెలిసికొనీ
వేదములందును యజ్ఞములందును విమల దానముల యందుననూ!
తపస్సు లందున బుణ్యఫలంబులు దగ జెప్పగబడి యుండినవో
వానినన్నటిని యతిక్రమించిన యొనరగ పుణ్య ఫలంబులనూ!
పొందగలడు సర్వోత్తమ స్థానము నందగలరు దా బ్రహ్మమునూ! 28

"అక్షరమగు బరబ్రహ్మ యోగమును నలరుచు నా మధుసూదనుడున్!
అర్జునునకు నుపదేశించెను మఱి నల కురుక్షేత్రము నందుననూ"
అనుచు దెలిపె ధృతరాష్ట్ర విభునకును వినయముగా సంజయుడు మఱిన్
దాను వినిన గాంచిన విషయములను దగ ముత్తియముల గూర్చినటుల్!
29

(అక్షర పరబ్రహ్మయోగము సమాప్తము)

ఓం

# శ్రీ భగవద్గీత

## తొమ్మిదవ అధ్యాయము

## రాజవిద్యా రాజగుహ్య యోగము

శ్రీ భగవానుడు శ్రీకృష్ణుండును శ్రీకరముగ యా పార్ధునికిన్!
రాజగుహ్యముగు రాజవిద్యనూ రమ్యముగా నిటులను దెలిపెన్!
దేనిని తెలిసిన యశుభరూపమగు జనన మరణ బంధమునుండీ
విడివడుదువో ఓ కౌంతేయా! విను! గడు రహస్యమైనదియున్నూ
అనుభవ జ్ఞానముతో గూడినదీ యలరు బ్రహ్మజ్ఞానము నీకున్!
అసూయలేనీ యర్జున వినుమా! యలరి దెలిపెదను విశదముగా! 1

విద్యల లోపల శ్రేష్ఠంబైనది విమల రహస్యం బైనదియున్
సర్వోత్కృష్టము పవిత్రమైనది సర్వోత్తమమును నైనదియున్!
ప్రత్యక్షముగా దెలియదగినదియు బన్నుగ ధర్మ ప్రయుక్తమునూ!
ఆచరించుటకు సులభమునైనది యలరి నాశ రహితమునైనా
అలరునట్టి బ్రహ్మ జ్ఞానంబును అర్జున! నీ కుపదేశింతున్! 2

అశ్రద్ధవంతులు నగు బురుషులు నను నందుకొనక యీ ధర్మమునూ!
హొందజాలకను మృత్యురూపమగు బొరలుచు సంసారమునందున్
మరల మరల జన్మించుచుండిరీ మానవ జన్మ పరంపరనూ!
సుఖదుఃఖంబుల దేలుచుండిరీ చోద్యముగను విషయాసక్తిన్! 3

అవ్యక్తంబగు రూపంబున నే నలరియుంటి నీ విశ్వమునన్!
సర్వభూతములు నా యందున్నవి సవ్యసాచి! విను! నాబలుకుల్!
వానియందు నే నుండుటలేదూ! వర్తిలు చుండును నా యందున్! 4

ప్రాణకోటి నా యందున నుండదు బన్నుగ జూడుము! కౌంతేయా!
ఈశ్వర సంబంధబున్నైన యీ యింపుగ యోగ మహా మహిమన్!
ప్రాణికోట్ల యుత్పన్న మొనర్చుచు భరించునది యైనను గూడన్
ఆ ప్రాణులయం దుండుటలేదూ నాధారముగా జేసికొనీ! 5

ఏవిధముగ నంతట జరించుచును నిల గొప్పదియగు వాయువునూ!
అంతరిక్షమున యెటుల నున్నదో వింతగ యారీతిని నాలో
సకల ప్రాణికోటియు నున్నదనీ సవ్యసాచి! గ్రహియింపు మికన్!
నాలోనున్నది సకలంబును మఱి నయముగ ప్రాణుల లేను సుమా! 6

ప్రాణికోటి యంతయును నర్జునా! ప్రళయ కాలమున నామాయన్!
నాదు ప్రకృతిని యణిగియుండునూ! నయముగ కురునందన వినుమా!
తిరిగి సృష్టికాలమున సృజింతును దీరుగ మఱలను నే వానిన్!
స్వకీయ కర్మకు లోబడి యుండును సర్వప్రకృతియు కౌంతేయా! 7

స్వకీయ కర్మకు నీ ప్రకృతిని సర్వమధీనముగా నుండన్!
అస్వతంత్రమై నట్టిది యును నగు నఖిల ప్రాణి సముదాయంబున్
స్వకీయ ప్రకృతి నవలంబించుచు సర్వ భూతముల గౌంతేయా!
మఱల మఱల సృజియించు చుంటినీ మఱల మఱల నీ ప్రకృతినీ 8

ఓ యర్జున! నే నా ప్రకారముల నొప్పుగ జీవుల సృజించినన్!
సృష్ట్యాదీ కర్మలయందున నే నలరి బద్ధుడను గాను సుమా!
సాక్షీభూతునిగా నుండెదనూ! సర్వజీవులను సృజించినన్!
వాని కర్మలవి నను బంధింపవు గనుచుందును లీలగ వానిన్! 9

సవ్యసాచి! సాక్షీభూతుడనై సకలమునకు నధ్యక్షుడనై
నాచేతను, నీ ప్రకృతి మాయచే నయముగ చరాచరము నంతన్!
సృజియించుచు నున్నది ధనంజయా! సృష్టి మూడ ముచ్చట గొలుపన్!
ఈ కారణమున యీ ప్రపంచమిటు నింపుగ జరించు చున్నదియున్! 10

పరమతత్త్వమును నెఱుగని మూఢులు బన్నుగ జగతిని గాపాడన్!
మానుషదేహము నాశ్రయించినా మహేశ్వరుండను బ్రాణులకున్ 11

వ్యర్థమైన యాశలు గలవారును వ్యర్థకర్మలును గలవారున్!
వ్యర్థమైన జ్ఞానము గలవారును బుద్ధిహీనులును మఱియగుచున్!
రాక్షస మాసుర సంబంధములను రగులుచు వానికి లోబడుచున్!
బ్రకృతి మోహినిని యాశ్రయించుచును బ్రబల మాయకును బద్ధులునై! 12

మహాత్ములగు వారలు విను పార్థా! మఱి దైవీ ప్రకృతియందున్
నిలిచి సమస్తములైన ప్రాణులకు నిఖిల చరాచర మంతటికిన్!
ఆదికారణుడ నవ్యయు ననుచును నలరి యెఱిగి మది స్థిరముగనూ!
అన్య మనస్కులుగాకను నన్నే యలరి భజించుచు నుందురుగా! 13

పైని జెప్పినా దైవీ ప్రకృతి బన్నుగ గలిగిన సత్పురుషుల్
ఎల్లప్పుడు నను గీర్తించుచునూ నింపుగ దృఢవ్రత నిష్ఠులునై
యత్నించుచు నను సదా భక్తితో నలరి వందనము జేయుచునూ!
సదా చిత్తమును నా యందుంచుచు సదా భజించుచు నుందురుగా! 14

జ్ఞాన యజ్ఞమున గొందఱు అర్జున దాను బ్రహ్మమను భావముతో!
అద్వైతంబగు భావముతోడను నలరి భజింతురు గొందరిలన్!
మఱి కొందఱు మఱియొక విధంబునను మానుగ ద్వైత విభావముతోన్!
వివిధ దేవతా రూపమునున్నది విమల బ్రహ్మమను భావముతో!
ఆ దేవతలను నొక్క దేవతను నలరి భజించుచునుండి రిలన్!
ద్వైతా ద్వైతము వివిధ రూపముల దగబూజించుచు నుండిరిలన్! 15

నేనే క్రతువును నేనే యజ్ఞము నేనే యన్నము నౌషధమున్!
నేనే మంత్రము నేను హవిస్సును నేనే యగ్నిని సర్వమునూ!
హోమకర్మమును నేనే యర్జున! విమల ధర్మమును నేను సుమా! 16

తండ్రిని నేనే యీ లోకమునకు తల్లిని నేనే కౌంతేయా!
సంరక్షకుడను తాతను నేనే దగ తెలియందగ వస్తువునూ!
పవిత్రమగు వస్తువును నర్జునా ప్రణవ నాదమును నేను సుమా!
ఋక్సామ యజుర్వేదంబులునూ ఋషుల వాక్యము నేను సుమా! 17

గతియును నేనే భర్తను నేనే కనికరించు ప్రభువును నేనే!
సాక్షియు, మఱి ప్రాణుల నివాసమును శరణ మొందదగు పురుషుడనూ!
సృష్టి స్థితి లయ కర్తను నేనే స్థిరమగు నిక్షేపము నేనే!
నాశరహితమగు బీజము నేనే నయముగ సర్వము నేను సుమా! 18

సూర్యకిరణముల దపింపజేయుచు సురుచిరముగ వర్షంబు నిలన్
గురిపించుచు మఱి నిలిపెడివాడను గూరిమి వినుమో ధనంజయా!
మోక్ష మృత్యువులు రెండును నేనే ముదమున నిట్లే సర్వమునూ!
సద్వస్తువు మఱి యసద్వస్తువును సకలము నేనే పాండుసుతా! 19
మూడు విద్యలను నధ్యయనంబును ముదమున జేసిన వారలునూ!
సకామ భావముతోని కర్మలును సరసత గావించిన వారున్!
సోమపానమును జేసిన వారును విమల యజ్ఞములతో భక్తిన్
పూజించుచు స్వర్గంబు కొఱకునై బొలుపుగ ప్రార్థించెదరు ననున్
అట్టివారు మరణా నంతరమున గట్టిగ సురలోకములందీ
దివ్యమైన సుఖములు స్వర్గంబున దేవబోగముల నందుదురూ! 20
అట్టివారు స్వర్గాభిలాషులును నా విశాలమగు స్వర్గమునన్!
స్వర్గ సుఖంబుల ననుభవించి మఱి సరసత పుణ్య ఫలంబులనూ
క్షయము నొందగను యీ లోకంబున సరసత జన్మము నొందుదురూ!
సకామ కర్మల నాచరించుచును సారహీనమగు భోగములన్!
అభిలషించుచును ననుభవించుచును నల రాకడ బోకడ గలిగీ
జనన మరణముల చక్రము దిరుగుచు శాంతిలేక వారుండెదరూ! 21
అన్య చింతనలు లేని వారునై నన్ను గూర్చి ధ్యానించెదరో!
ఎల్లప్పుడు నన్నే ధ్యానించుచు నింపుగ నిష్ఠను నిలుపుదురో!
అట్టివారి యోగ క్షేమములను గట్టిగ నేను వహించెదనూ! 22

ఎవరు అన్య దేవతలయందునను నింపుగ భక్తిని గలవారై
శ్రద్ధతోని యారాధించెదరో శ్రద్ధాన్వితులగు వారలునూ
నన్నావిధముగ క్రమమును దప్పుచు నారాధించుచునున్నారూ!
క్రమముదప్పి పూజించుచుండిరీ విమల పథంబుల దొలగుచునూ! 23

ఏలయనగ యజ్ఞముల కన్నింటికి నింపుగ భోక్తను ప్రభువును నే
అట్టి నన్ను వారలు యదార్థముగ గట్టిగ దెలియుట లేదుసుమా
ఇందువలన సత్పథమును దప్పి చిందుచు జారుచు నుండి రిలన్!
పునర్జన్మమును బొందుచుండెదరు జనన మరణ బంధము లందున్! 24

దేవతలను నర్చించెడివారలు దేవతలను వారొందెదరూ!
పితృవ్రతులు పితృలను బొందెదరు ప్రియముగ భూతంబులను నిలన్
పూజించెదరో భూతంబులనూ పూనిక తోడను బొందెదరూ!
నను పూజించెడివారు నందుదురు నాలో ప్రియముగ నైక్యమునూ! 25

ఎవడు నాకు పత్రంబునుగానీ నింపుగ పుష్పంబునుగానీ,
ఫలమునుగానీ, తోయముగానీ భక్తి సమర్పణ గావించున్!
అట్టి భక్తునీ భక్తి పూర్వకము నర్పించిన యా వస్తువులన్
ప్రియతాత్ముడనై స్వీకరించెదను ప్రీతి నారగింతును పార్థా! 26

సావధానముగ వినుమో యర్జున ! చక్కని వాక్యము దెలిపెదనూ !
ఏది చేసినను నేది భుజించిన యేది హోమమొనరించివనూ !
దానము జేసిన; తపస్సు జేసిన దానిని నా కర్పింపు సఖా ! 27

ఈ ప్రకారముగ 'కర్మ సమర్పణ' యిమ్ముగ యోగముతోగూడీ
పాపపుణ్యముల ఫలముల దొలగీ బన్నుగ మోక్షము నందెదవూ !
కర్మబంధముల నుండి దొలగెదవు ! గడు శీఘ్రముగా గౌంతేయా ! 28

సమముగ నుందును సర్వభూతముల సరసతగా నా కొక్కడునూ !
ఇష్టుడుగాని యనిష్టుడుగానీ నింపుగ యెవ్వరులేదు సుమా !
ఎవరు నన్ను భక్తిని సేవింతురొ యెవరు నన్ను పూజించెదరో !
వారుందురు నాయందున పార్థా ! వారి యందు నే నుండెదనూ ! 29

దురాచార పరుడైనను బార్థా ! దురాలోచనా బరుడైనన్ !
అనన్యభక్తిని గలవాడగుచును నాతడు నన్ను భజియించినచో
సాధుపనుచు మఱి జెప్పగ వచ్చును సత్పురుషుండని యాతఁడినీ !
స్థిరముగ నుత్తమ మనోనిశ్చయము శీలము గ?గీ యుండుటచే ! 30

సాధు శరణు బొందిన పాపియునూ నయముగ శాంతిని బొందు సుమా !
ధర్మబుద్ధి మఱి గలవాడగుచును శాశ్వతసుఖముల నందుకొనున్ !
నాయన ! యర్జున ! ప్రతిజ్ఞ సేయుము ! నాభక్తుడు జెడడని యనుచున్ !31

అర్జున ! యెవ్వరు బాపజన్మమును నలరి దగిలి యుందురో వారున్ !
స్త్రీలును, వైశ్యులు, నట్లేశూద్రులు స్థిరముగ నన్నాశ్రయమందీ !
నిర్మల సర్వోత్తమమగు మోక్షము నిశ్చయముగ బొందెద రింకన్ 32

పుణ్యాత్ములునగు విప్రుల విషయము బూని రాజఋషులను గూర్చి
చెప్పనేల వారలు సర్వజ్ఞులు నొప్పగ బ్రహ్మము నందెదరూ !
అనిత్యమును మఱి యశాశ్వితమునగు అట్టి లోకమిది కౌంతేయా !
కావున నీవును ననుభజింపుమా ! గల శాశ్వతమును నందుటకున్ ! 33

నా యందే మనసును గలవాడవు నా భక్తుండవు నగుము నికన్ !
నను బూజించెడివాడవు గమ్మా నాకు నొనర్పుము వందనముల్ !
నా యందే చిత్తంబును నిలుపుచు నన్నే పరమని భావించీ
మత్పరాయణుడవై యుండినచో మానుగ నను నందగగలవూ ! 34

రాజగుహ్య యోగ౦బు నీ విధిని రమ్యముగా నా మధుసూదనుడున్
అర్జునునకు నుపదేశించెను మఱి నలదు కురుక్షేత్రము నందున్
అనుచు దెలిపె ధృతరాష్ట్రి పభునకును వినయముగా సంజయుండు మఱిన్
దాను వినిన గాంచిన విషయములను దగ ముత్తియములను గూర్చినటుల్ !

(రాజవిద్యా రాజగుహ్య యోగము సమాప్తము)

ఓం

# శ్రీ భగవద్గీత

## విభూతి యోగము

## పదియవ అధ్యాయము

భగవానుండగు హృషీకేశుడును బన్నుగ బార్థునితో ననియెన్
ఏ మాటలు విని సంతోషించుచు నింపుగ యుంటివొ యాసక్తిన్ !
ఇంకను దెలిపెద మహాబాహు విను ! నిల శ్రేయస్కరమగు దానిన్ !
నీకు మేలు గలుగగ జేయును విను ! నిర్మలమగు మనసున బార్థా ! 1

దేవగణము లెఱుగవు బరంతపా ! దివ్యమైన నాయుత్పత్తిన్ !
మహర్షులును దెలియరు నాజన్మము మహా ప్రభావములను నాదున్ !
ఏలయనిన యా మహర్షులకునూ నిమ్ముగ యాసుర గణములకున్
సర్వులకును నే గారణభూతుడ సకలమునకు నే నాదిగదా ! 2

ఎట్టివాడు నను ననాది యంచును గట్టిగ మనసున భావించీ !
సర్వలోకముల మహేశ్వరుడనని సర్వోత్తముడని మది దలచున్ !
మనుజులలో నజ్ఞానము దొలగీ మహాపాపముల ముక్తుండై
విడువబడుచునున్నాడు అర్జునా ! విమల భావమును బొందుచునూ ! 3

బుద్ధి జ్ఞానము న సమ్మోహమును క్షమా సత్య దయ శమములనూ !
సుఖదుఃఖంబులు, పుట్టుక నాశము, శోకము భయాభయంబులునూ !
అహింసయును మఱి సమత్వంబునూ ! సంతుష్టియు దప దానములున్ !
కీర్తియు, నపకీర్తియును బాండవా ! యార్తియు మున్నగు గుణములునూ!
నా వలనను నిల గలుగుచున్నవి ! నయముగ చిత్ర విచిత్రముగా ! 4-5

ఈ లోకంబున యీ ప్రజలందఱు నిమ్ముగ యెవ్వారలకు మఱిన్
సంతతియై యున్నారో యర్జున ! సప్తఋషులు సనకాదులునూ !
దేవఋషులు మనువులు బదునలువురు దివ్యమైన నా భావమునన్ !
నాదు మహాసంకల్పంబున బుట్టిరి నయముగ దైవీ భావమునన్ ! 6

నా యీ విభూతి యైశ్వర్యంబును నయముగ విస్తారంబులనూ
నా యోగంబు నలౌకిక శక్తియు నర్మిలి గ్రహింపుచును నుండున్ !
ఆ మనుజుడు నిన్చల యోగంబున నను మఱి బొందుచు నున్నాడూ
ఈ విషయంబున సందేహం బిల నించుకంతయును లేదు సుమా ! 7

నేనే సమస్త లోకంబులకును నేనే గారణమనుచు మదిన్ !
నా వలనను నీ సమస్తంబులును నయముగ నడుచుచు నున్నవనీ
వివేకవంతులు, జ్ఞానులు, యోగులు విమల భక్తి భావముతోడన్ !
నన్ను భజించుచు నుందురు బార్థా ! వినయ భక్తి భావము తోడన్ ! 8

నా యందున జిత్తము నర్పించీ నాయందున దమ ప్రాణములన్ !
నర్పణంబు జేసియు నింద్రియముల గర్వారమువలె గఱగుచునూ !
బరతత్త్వంబును, నాత్మతత్త్వమును బహువిధ చర్చల జేయుచునూ
సంతృప్తిని యానందము బొందుచు సద్గతి నందుచు నున్నారున్ ! 9

సతతము నాపై మనస్సు గలిగీ బ్రీతి భజించెడి వారలకున్
దేనిచేత నను నందగ గలరో దివ్యజ్ఞాన సుయోగంబున్ !
ఆత్మా నాత్మ వివేచన శక్తిని యలరి బుద్ధి యోగంబులనూ
ప్రసాదించుచుంటిని కౌంతేయా ! భక్తిభావమును గమనించీ ! 10

అట్టి భక్తులను దారిజూపుటను నంతఃకరమునను నిలిచీ !
భాసమానమగు జ్ఞానదీపమున బ్రబలమైన యా చీకటి నే
అజ్ఞానంబును రూపు మాపుచును నలరుచునుంటిని కౌంతేయా ! 11

మహాబాహువగు బార్థుడు పలికెను మధుసూదనుతో వినయమునన్ !
కృష్ణా నిన్నే పరబ్రహ్మగను బరంధాముడవు ననుచు మఱిన్ !
బరమ బావనునిగా నిత్యునిగా బ్రికాళ రూపునిగా నిన్నున్ !
బరమ పురుషునిగ యాదిదేవునిగ బన్నుగ లోకేశ్వరు డనుచున్ ! 12

ఆదిదేవునిగ జన్మరహితునిగ యఖిల వ్యాపకునిగా నిన్నున్
దేవర్షియునగు నారదుండునూ దేవలుండు, నసితుండు మఱిన్
మునులును, ఋషులును, వేదవ్యాసుడును వినయముగా దెలిపిరి కృష్ణా !
నీవును స్వయముగ తెలుపుచుంటివీ ! నిర్మలమగు నీ రూపంబున్ ! 13

కేశవ ' దేనిని తెలుపుచుంటివో ! కీర్తినిలయ ! యదియంతయునూ !
సత్యమనుచు నే తలచుచుంటినీ సర్వేశ్వర యంతర్యామీ !
ఓ భగవంతుడ ! నీ నిజరూపము నొప్పుగ దేవతలు మఱియున్
నసురులుగానీ దెలియగ జాలరు నాది పురుష ! యిదె వందనమూ 14

సకలభూతముల సృజించువాడవు సకలేశ్వరుడవు బరమాత్మా !
దేవదేవ ! ఓ జగత్పతీ ! విను ! దివ్యత్వము నీకును నీవే !
తెలియగలవు ! మఱి యితరులెవ్వరును దెలియగ జాలరు జగదీశా ! 15

ఎట్టి దివ్యమగు నీ విభూతులను నెట్టి మహాత్మ్య విస్తారములన్
ఈ లోకంబుల నన్నిటి లోపల యింపుగ యుంటివో వ్యాపించీ!
అట్టి దివ్యమగు నీ విభూతులను గట్టిగ సకలము దెలుపగనూ!
నీవే దగుదువు దెలుపుము కృష్ణా! నిర్మలమతి నే వినియెదనూ! 15

యోగీశ్వర! నే నెల్లప్పుడునూ యోగముతో నే విధముగనూ!
ప్రార్థించుచు నే తెలిసికొందునో భగవంతుడ! దెలుపుము నాకున్!
ఏయే వస్తువులందు నిన్ను నే నింపుగ ధ్యానింపగవలెనో!
విశదము సేయుము వివరముగా నే వినియెద శ్రద్ధాభక్తులతో! 17

నీదు యోగమహిమను, విభూతులను నిను ధ్యానింపగ దగువానిన్
సంపూర్ణముగా దెలియజేయుమా! సరసిజాక్ష! మఱిను వేగన్!
నీ యమృత వాక్యములను వినుచును నిర్మల భావము దెలియుచునూ!
సంతృప్తియు గలుగుట లేదు సుమా! సంతతంబు వినవలయు ననీ
కుతూహలంబును గలుగుచు నున్నది కూరిమి దెలుపుము గోవిందా! 18

భగవంతుండగు కృష్ణుడు పదెకెను భవ్య భావమున బార్థునితో!
అర్జున వినుమా! నా విభూతులను నంతములేదు గదా మఱియున్!
ప్రాధాన్యంబును ననుసరించి నే బన్నుగ కొన్నిటి దెలిపెదనూ!
సావధానముగ వినుమా! అర్జున! సకల విశ్వమున నే నుంటిన్! 19

అర్జున వినుమా! యఖిల ప్రాణులను నలరు హృదయమున నుండిన యా
అమల ప్రత్యగాత్మను నేనే సుమ! యఖిల భూతకోటికి మఱియున్!
ఆది మధ్య యంతములును నేనే యల సృష్టి స్థితి లయములకున్!
నేనే కారణమని మది దెలియుము నిఖిల లోకముల వర్తనకున్! 20

ఆదిత్యులలో విష్ణువు నేనే యిల ప్రకాశమగు వారలలో
కాంతికిరణములు గల సూర్యుండను క్రాంతి పరాక్రమ!! విను నేనే!
మరత్తులను దేవతల లోపలను మరీచి యను వాడను నేనే!
నక్షత్రములను, ఐంద్రుడ నేనే! నయముగ వినుమా! కౌంతేయా! 21

నే వేదములను సామవేదమును నే దేవతలను నింద్రుడనూ!
ప్రన్నుగ యింద్రియముల మనస్సునూ ప్రాణులలో జైతన్యమునూ! 22

రుద్రులలో నే శంకరుడనూ రూఢిగ యక్షుల రాక్షసులన్!
విత్తేశుండను వసువుల లోపల విమల యగ్నియును నేను సుమా!
పర్వతములలో మేరుపర్వతము బన్నుగ నేనే కౌంతేయా! 23

పురోహితులలో ముఖ్యుండగు నా స్ఫూర్తి బృహస్పతి నేను సుమా!
సేనానులలో స్కందుడ నేనే స్థిరముగ సరసుల సంద్రమునూ! 24

మహర్షులను నే భృగుమహర్షినీ మానుగ వాక్కులలోపలనూ!
ఏకాక్షరమగు ప్రణవము నేనే నింపుగ నే నోంకారమునూ!
యజ్ఞములను నే జపయజ్ఞంబును నలరెడి స్థిరమగు వస్తువులన్!
హిమాలయంబును నేనే యర్జున! రమా యుక్తమగు కమలంబున్! 25

సర్వ వృక్షముల నశ్వత్థంబును సకల ఋషులలో నారదుడన్!
గంధర్వులలో జిత్రరథుండను గపిలమునిని సిద్ధుల యందున్! 26

అశ్వంబులలో నమృతంబుతో నంబుధిలో జన్మించిన యా!
యుచ్చైశ్రవసము నను నశ్వంబును, నున్నతమగు గజములయందున్!
ఐరావతమును, మనుజుల యందున మానుగ రాజును నేను సుమా!
ఈ విధముగ నను దెలియు మర్జునా! నింపుగ నాదు విభూతులనూ! 27
ఆయుధములలో వజ్రంబును నే యలరు బాడి యావుల యందున్
కామధేనువును నేనుసుమా మఱి విమల ధర్మబద్ధంబగు నా
ప్రజోత్పత్తికిని కారణభూతుడ కమనీయంబగు సృష్టికినీ
మన్మథుండ నే సర్పంబులలో మానుగ వాసుకి నేను సుమా! 28
నాగులలో నే ననంతుడనూ నయముగ జలదేవత లందున్!
వరుణుండను నే పితృదేవతల అర్యమయును నేనే పార్థా!
నియమించెడి వారలలో యముడను నిజముగ దెలియుము కౌంతేయా! 29
దైత్యులలో నే ప్రహ్లాదుండను దగ లెక్కించెడి వారలలో
కాలంబును నే మృగములలోపల గడు శ్రేష్ఠంబగు సింహమునూ!
పక్షులలో నే గరుత్మంతుడను పార్థా! విను! నా విభూతులన్! 30

వేగవంతులను వాయువు నేనే! విమలత నొందించెడి వాడన్!
ఆయుధములను ధరించువారిలో నలరు రామచంద్రుడను నే!
ఝషములలో మకరంబును నేనే జలజల పారెడి నదులందున్;
జాహ్నవినై యుంటిని నే నర్జున! జ్ఞానులందఱికి దెలియునిదీ! 31

సర్గణమునకును నాది మధ్యములు సరగున గలిగెడి యంతములున్!
సృష్టిస్థితి లయముల కన్నింటికి చిత్రగతిని నేనే పార్థా!
విద్యలలో నాధ్యాత్మ విద్యయును విమల తత్త్వ నిశ్చయనకై
వాదంబును నేనే యైయుంటిని వేదములును సర్వము నేనే! 32

అక్షరములలో 'అ'కారమును నే యలరు సమాసములందుననూ!
ద్వంద్వ సమాసమునై యున్నాడను దగ యక్షయ కాలంబును నే!
కాలమునకు గాలము నైనట్టి దగ బరమేశుడ గౌంతేయా!
విశ్వతో ముఖములును గలిగిన యా విరాట్ స్వరూపుడ నే పార్థా! 33

సకలంబును మఱి సంహరించు నా వికల మృత్యువును నేను సుమా!
ఉద్భవించు సర్వంబులకును మఱి యుత్పత్తియు నే ధనంజయా!
స్త్రీలయందుగల కీర్తిసంపదలు స్థిరమగు వాక్ స్మృతి జ్ఞానంబున్
ధారణ శక్తియు గల బుద్ధియునూ, ధైర్యము, ఓర్పును నీయేడున్
నేనే యీ యేడింటి గుణములను నిరతము ధరించి యుండెదనూ! 34

సామగానమున బృహత్సామమును ఛందస్సుల గాయత్రియునూ!
మాసములందున మార్గశీర్షమును మధురములగు ఋతువుల యందున్!
కుసుమాకరమగు వసంతఋతువును గూరిమి నేనే కౌంతేయా! 35

సప్త వ్యసనముల జూదంబును నే తేజోవంతుల దేజంబున్!
జయించువారల జయమును నేనే సాత్త్వికులయు సత్త్వంబును నే!
ప్రయత్నశీలుర ప్రయత్నమును నే బన్నుగ వినుమా బరంతపా! 3

వృష్ణికులజులను వాసుదేవుడను వినుమా! పాండవులందుననూ!
ధనంజయుండను మునులయందునను దగ వేద వ్యాసుండను నే!
కవులయందు శుక్రాచార్యుండను గాంచుము! నాదు విభూతులనూ! 27

దండించెడి వారల దండనమును, దగ జయింప గోరెడి వారల్
జయోపాయమును నీతిని నేనే జాగృతియును నేనే పార్థా!
రహస్యములలో మౌనంబును నే రాజిలు జ్ఞానుల నుండెడి యా!
జ్ఞానంబును నేనే కుంతీసుత! జ్ఞాన పథంబును నేను సుమా! 38

సకల ప్రాణికోటికి యెది మూలమొ సర్వకారణం బెయ్యదియో!
ఆదియును నేనై యుంటిని యర్జున! యా యీ మాటలు నేల యికన్!
చరచరాత్మక వస్తువేదియును సరి విడియుండగ లేదు సుమా!
నాకంటెను మఱి వేఱు లేదుగా నయముగ యీ లోకము నందున్ 39

నాదు దివ్యములు నగు విభూతులకు నయముగ యంతము లేదు సుమా!
అయినను సంక్షేపము కొన్నింటిని నలరి దెలిపితిని బరందపా! 40

ఈ ప్రపంచమున యైశ్వర్యమునై యింపుగ నిర్మల మైనదియున్!
ఉత్సాహముతో గూడియున్నదియు నురుగుణ యుక్తంబై నదియున్!
శక్తివంతమును గాంతివంతమును సహజ ప్రాణియును, వస్తువునూ
ఏది యేది గలదో యది యంతయు నింపుగ నా తేజస్సు సుమా!
నా యంశముగల దానిగా దెలియు! నయముగ జ్ఞానము వికసింపన్! 41

అర్జున! విను! విస్తారమైన యీ యలరు విభూతుల జ్ఞానమునన్
ఏ ప్రయోజనము నీకిక కలుగును విస్తారము బోధించిననూ!
ఈ జగత్తునంతను నర్జున విను! నేకాంశముచే వ్యాపించీ
యుంటిననుచు నను దెలియుము బార్థా! కంటికి గనబడకుండగనూ! 42

ఈ విధముగ విభూతియోగమును నింపుగ యా మధుసూదనుడున్!
కుంతీసుతునకు నుపదేశించెను గూరిమి కురుక్షేత్రము నుందున్!
అనుచు దెలిపె ధృతరాష్ట్ర విభునునకును వినయముగా సంజయుడు మఱిన్
దాను వినిన గాంచిన విషయంబుల దగ ముత్తియములను గ్రుచ్చినటుల్ 43

(విభూతి యోగము సమాప్తము)

# శ్రీ భగవద్గీత

## విశ్వరూప సందర్శన యోగము

### పదునొకండవ యధ్యాయము

శ్రీకృష్ణునితో బలికెను పార్థుడు భక్తిభావమున వినయముతో!
కృష్ణా! నన్నిటు ననుగ్రహింపగ కృపతో సర్వోత్తమమైనా
ఆధ్యాత్మంబను పేరుగలిగినది యతి రహస్యమై యున్నదియున్!
ఏయుపదేశము నీవు జేసితివో నింపుగ నా యజ్ఞానంబున్!
దొలగిపోయినిది కృష్ణా! పూర్తిగ తోరముగా విమలుడ నైతిన్! 1

కమలపత్ర నేత్రుడవగు కృష్ణా! కరుణ నీ వలన ప్రాణులయున్!
ఉత్పత్తియు మఱి వినాశంబులను తత్త్వము నీదు మహాత్మ్యంబున్!
సవిస్తరముగా వింటిని కృష్ణా! సందేహంబులు దొలగంగన్! 2

ఓ పరమేశ్వర! నిన్ను గూర్చియును నీతత్త్వం బంతయుగూడన్!
నీవు దెలిపినది యంతయు సరియని నిజమని మది నమ్ముచు నుంటిన్!
ఓపురుషోత్తమ! యీశ్వరీయమగు నొప్పుగ విమలం బై నదియున్!
విశ్వరూపమును జూడవలయునని విమలభావమున నేనుంటిన్! 3

ఆ నీ స్వరూపమును జూచుటకును నలరి జూడ దగుదును నంచున్!
దలతులేని మఱి సాధ్యంబనుచును దగ యోగీశ్వర! పరమాత్మా!
నాశరహితమగు విశ్వరూపమును నయముగ జూపింపుము నాకున్! 4

అర్జును డటు బలుకగ భగవానుడు నర్థయుక్తముగ యిటులనియెన్!
అర్జున! యనేక విధముల నున్నవి యలౌకికములై యున్నవియున్!
నానావిధముల దివ్యములైనవి నానావర్ణములును గలవీ!
వర్తించెడి రూపంబులు గనుమా! వరుసగ దర్శింపుము వానిన్! 5

ఆదిత్యుల, వసువుల! రుద్రులనూ యశ్విని దేవతలను గనుమా!
అర్జున! మరుత్తులను దర్శింపుము నలిరి యెన్నడును జూడని యా
పలువిధములు నగు నాశ్చర్యంబులు భారత! గనుమా నాసక్తిన్! 6

సకల చరాచర ప్రపంచమునూ సకల భూతకోటిని గనుమా!
దేనిని జూడగ దలచుచుంటివో! దానిని జూడుము! కౌంతేయా!
నా శరీరమున యవయవంబుగా నయముగ యుండిన దానిని నే
ఒక్కచోట నున్నట్టిదానిగా జక్కగ దర్శింపుము పార్థా! 7

ఈ నీ మాంసయంబగు కన్నుల నింపగు విశ్వ స్వరూపంబున్!
జూడగజాలవు దివ్యనేత్రములు సురుచిరముగ యిచ్చుచుదుంటిన్!
దానిచేత యీశ్వర సంబంధము దగ నాయోగ మహాత్మ్యమునూ!
దర్శింపుము! గుంతీపుత్రా! మఱి దగజూడుము నా విభూతులన్! 8

సంజయుండు వలికెను ధృతరాష్ట్రుని సదయ శీలతను వినయమునన్!
మహారాజ! ధృతరాష్ట్ర భూవిభూ! మానుగ నాపలుకులు వినుమా!
యోగీశ్వరుడగు నా పరమాత్మయు దగ యీ రీతిని వచియించి
పర్వోత్తమమగు విశ్వరూపమును సరసత యర్జునునకు జూపెన్! 9

అనేక ముఖములు, నేత్రంబులునూ యనేక యద్భుత విషయములున్!
అలరి జూపునది దివ్యములైనా యాభరణంబులు గూడినదీ!
ఎత్తబడిన దివ్యాయుధలంబులును నొత్తబడిన శంఖంబులతో
పుష్పమాలికల దివ్యాంబరముల బొలుపుగ ధరించి యున్నదియున్! 10

దివ్యమైనగంధపు బూతలతో భవ్యమైన ఉలకంబులతో!
అనేక యాశ్చర్యముల నిండినది యలరి ప్రకాశం బైనదియున్!
విశ్వతోముఖము, ననంతమైనది విమల మహస్సులతో గూడీ!
అట్టివిశ్వరూపము భగవానుడు నాయర్జునునకు జూపించెన్! 11

వేఁసూర్యులొాలకసారి నభంబున విమలకాంతులను బమ్ముచునూ
బయలుదేరుచో నెంత కాంతియును బస్నుగదివి భువిలో నుండున్!
అంతకాంతితో నా మహాత్ముడును వింత ప్రకాశంబున నుండెన్!
అట్టి విశ్వరూపము భగవానుడు నా యర్జుననకు జూపించెన్! 12

అప్పు డర్జునుడు విశ్వరూపమును నాశ్చర్యంబుగ గాంచె నటన్!
నానావిధముల విభజింపగబడి నయముగ యుండెడి లోకంబున్!
శ్రీభగవానుని శరీరంబునను స్థిరముగ యవయవమును బోలెన్!
ఒక్కచోట నున్నట్టి దానిగా నిక్కముగా నాతడు గాంచెన్! 13

విస్మయ విష్టుండె యర్జునుడును హృష్టరోముడై యావెంటన్!
విశ్వరూపమును దాల్చినట్టి యా విమలుడైన భగవానునకున్!
శిరస్సుచే వందనములు జేయుచు చేతులు మఱి జోడించుకొని
ఈవిధముగ వలికెను ధనంజయుడు నింపుగ శ్రీకృష్ణుని తోడన్! 14

దేవా! నీదు శరీరమందునను దేవతలను నే గనుచుంటిన్!
సకలచరాచర భూతకోటినీ! సకలసృష్టి కర్తయును నగూ!
బ్రహ్మదేవునీ, సమస్త ఋషులను బస్నుగ గాంచుచు నుంటి నిటన్!
దివ్యములగు నద్భుత సర్పములను దీరుగ గనుచుంటిని కృష్ణా! 15

అనేక వక్త్రములును, నుదరములును ననేక ముఖములు, నేత్రములన్!
అనేక రూపములును గలవానిగ యలరి జూచుచుంటిని కృష్ణా!
అంతంబును, మధ్యంబు, నాదియును నలరుచు గనలేకుంటినిగా
విశ్వరూప విశ్వేశ్వర వినుమా! విమలంబగు నా వినతులనూ! 16

నిను కిరీటమును గలవానినిగా గదను ధరించిన వానిగనూ!
చక్రంబును ధరియించిన వానిగ శంఖము బూనిన వానిగనూ!
తేజోరాశిగ దీప్తిమంతునిగ దివ్యప్రభలు గల వానినిగా!
అగ్నిసూర్యులా మహసులు గలిగిన నల బరిమితి లేనట్టి నినున్!
అంతట జూచుచు నుంటిని కృష్ణా! అపరిచ్ఛిన్నునిగా నిన్నున్! 17

అఖిల జనులు దెలియందగినట్టి యక్షరమగు బరబ్రహ్మవునూ!
అఖిల జగత్తువ కంతటికిని మఱి యాధారుండవు బరమేశా!
నాశరహితుడవు! శాశ్వత ధర్మము నయముగ రక్షకుడవు నీవున్!
సనాతనుండవు! బురుషోత్తముడవు! బూర్ణపురుషుడవు! గోవిందా! 18

ఆదియు మధ్యాంతములును లేనీ యనంత వీర్యంబును గలిగీ!
అనంత బాహువులును గలవానిగ యల శశిసూర్యులు కన్నులుగన్
గలవానినిగా హుతాశనునివలె కాంతివక్త్రమును గలవానిన్!
స్వకీయ తేజస్సున విశ్వంబును సరగున దపింపజేయుచునూ
యున్నవానిగను జూచుచు నుంటిని నిన్ను నేను! కృష్ణా! వినుమా! 19

ద్యావాపృథివుల నడుమ గాల్పునిండియుండిన ఆకాశమున్!
దిశలన్నియునూ నీ యొక్కవిచే దీరుగ వ్యాపింపగ బడియెన్!
భయంకరంబైనది యాశ్చర్యము బన్నుగ యీ రూపము గాంచీ
లోకత్రయమును భీతి నొందినది బ్రాకటముగ జూచుచునిన్నున్! 20

సురసంఘంబు అనేకము నీలో సురుచిరముగ జేరుచు నుండెన్!
కొందఱు భీతిని యంజలితోడుత చందముగా భజియించుచునూ!
మహర్షులును సిద్ధుల సమూహములు మానుగ క్షేమంబగు నంచున్!
సంపూర్ణములగు స్వస్తివాచకముల లింపుగ నుండిరి స్తుతించుచున్! 21

రుద్రులు, సూర్యులు, వసువులు మఱియును సాధ్యులు విశ్వేదేవతలున్!
అశ్వని దేవతలును, గంధర్వులు యక్షులు, నసురులు, సిద్ధులునూ!
అనంత సంఘంబులుగా నందఱు నాశ్చర్యంబును బొందుచునూ!
నిన్ను గాంచుచున్నారు మాధవా! నిఖిల జీవు లేకాగ్రతతో! 22

మహా వక్త్రములు నేత్రంబులునూ మహాబాహువులు నూరువులున్!
బహుపాదంబులు బహు నుదరంబులు బహు దంష్ట్రలచే గూడికొనీ
భయంకరంబగు విశ్వరూపమును బన్నుగ జూచుచు బ్రజలెల్లన్!
భయబడుచును న్నారు గేశవా! భయబడుచుంటిని నే గూడన్! 23

నింగిని దాకుచు నున్నవాడవై రంగులు విరజిమ్ముచు గృష్ణా!
ప్రకాశించుచును దివి భువి యంతయు బన్నుగ దెఱచిన వక్త్రములన్!
దీప్తమానమగు నేత్రంబులతో దివ్య రూపమును గాంచుచునూ!
భీతిల్లిన మనసును గలవానిగ ధృతి శాంతియు లేకను నుంటిన్! 24
కరాళమగు నీ దంష్ట్రల గాంచియు కాలానల సన్నిభములు నౌ!
నీ ముఖముల నే గాంచి ముకుందా! నిక్కము దిగ్భ్రమ జెందితినీ!
దిక్కులు దెలియక యుంటిని దేవా! దీనుడనై యుంటిని కృష్ణా!
ప్రసన్నుండవగుమో జగదీశ్వర! బన్నుగ నను గృప జూడగదే! 25
ఆ ధృతరాష్ట్రుని బుత్రు లందఱును నల భీష్ముండును ద్రోణుండున్!
కర్ణుండును మఱి వారిసేనలో గల రాజులు మఱి సేనానుల్!
అటులే విను! మన సేన యందునను నతిరథులందఱు ద్వరితముగన్!
జేరుచున్నవారై కోరలతో స్థిరమగు భయంకరములైనా
వక్త్రములందున బ్రవేశించుచును వరుసగ కొందఱు వారలలో
దశనాంతరముల జిక్కినవారై దగ జూర్ణితులై శిరములతో
కనిపించుచు నున్నారు మాధవా! గడు దీన స్థితి నొందుచునూ! 26-27
ఏ ప్రకారమున నదీ నదంబులు నిమ్మగ సముద్ర ముఖములునై
బ్రవహించుచు నున్నవో జనార్దనా! బన్నుగ యా విధమున నోటన్!
మనుష్యలోకమునందలి రాజులు మహారథులునగు నందఱునూ!
జ్వలించుచుండెడి నీ వక్త్రములను విలయమగుచు నున్నారుగదా! 28
ఏవిధి పతంగములు నాశమునకు నిమ్ముగ వేగమునను గూడీ
మండుచున్న యగ్నిని బడిపోవగ దఁడుగ బోవునో వడివడినీ!
ఆ విధమున జనులందఱుగూడను నతివేగంబున గూడికొనీ
నాశంబునకై నీ వక్త్రమునను నయముగబడుచున్నారు గదా! 29
మండుచున్న నీ వక్త్రంబులచే దండిగ జనులందఱ నంతన్!
బ్రమింగుచున్నవాడవునై కృష్ణా! రంగుగ యాస్వాదించుచునూ!
భయంకరములగు గాంతి పుంజములు బన్నుగ జగత్తు నంతటినీ!
వ్యాపించుచు మఱి భయంకరముగా బ్రబలుచు దపింప జేసెడినీ! 30

భయంకరంబగు నాకారముగల భవోత్తమ!నీవెవ్వడవో!
తెలుపుము దేవా! నీదు ప్రవృత్తిని దెలియకుంటి కావున కృష్ణా!
ఆది పురుషుడవు నగు నిను దెలియగ యాశించుచు నుంటిని దేవా!
నమస్కారములు నీకు జనార్దన! నన్ననుగ్రహింపుము నింకన్! 31

భగవంతుడగు శ్రీకృష్ణుండును బార్థునితో నీ విధి బలికెన్!
అర్జున విను! నే లోకంబులకును విజృంభించిన కాలుడనూ!
లోకజనుల నే సంహరించుటకు లోబడ వర్తించుచు నుందున్!
ప్రతి పక్షంబున గల యోధులునూ బన్నుగ నీవును లేకున్నన్!
యుద్ధంబును మఱి జేయకుండినను సిద్ధము మృత్యువు నొందెదరూ! 32

అందువలన యర్జున! లే లెమ్మా! యాలస్యము జేయకు మింకన్!
శత్రులపై విజయము సాధింపుము! సత్కీర్తిని బడయుము నింకన్!
సమృద్ధమగు రాజ్యమును బొందుమా! సర్వ సుఖములను బడయుమికన్!
చంపబడిరి వీరందఱు నాచే సంకోచింపకు నిదివఱకే!
నిమిత్త మాత్రము నుండుము బార్థా! నే జేసితి! జేయుదునంతన్! 33
ఇదివఱకే జంపగ బడినట్టి యిమ్ముగ ద్రోణాచార్య నికన్!
భీష్మాచార్యుని జయద్రధుని మఱి బెదరక కర్ణుని యితరులనూ!
యుద్ధవీరులను జంపుము బాండవ! యుద్ధము జేయుము భయబడకన్!
శత్రువులను గెలిచెదవు నిక్కముగ కాతర భావము వలదింకన్! 34
సంజయు డిటులను వలికె రాజుతో సరస వచనముల వినయమునన్!
శ్రీకృష్ణుని వచనము విని పార్థుడు జేతులు జోడించుచు మఱియున్!
మాధవునకు మఱి నమస్కరించుచు మానుగ భయపడు వాడగుచున్!
వినయంబున గద్గద స్వరంబునను విమలాక్షరముల నిటులనియెన్! 35
హృషీకేశ! నిను నుచ్చరించుటను హృది నిను గొనియాడుటజేతన్!
సకల లోకమును సంతోషించుచు శాంతి ప్రీతి నొందుచునుండెన్!
నిన్ను గాంచి రాక్షసులు భయంబున వెన్ను జూపి బోయిరి వేగన్!
సిద్ధ సమూహము లన్నియు నీకును జేరి నమస్కృతు లొనరించీ!
గీర్తించుచునున్నవి బరమాత్మా! కీర్తింతును నే నీ మహిమన్! 36

దేవదేవ! హే యనంతరూపా! దివిజేశ్వర! మధుసూదన హే!
సత్ అసత్తులకు సూక్ష్మ స్థూలముల సర్వంబును నగు రెండిటికిన్!
బరమగు నక్షర పరబ్రహ్మవును బన్నుగ నీవే యని దలతున్!
బ్రహ్మదేవునకు నాది కర్తవును సర్వోత్కృష్టుడ వగు నీకున్!
నమస్కరింతును! నీవే దగుదువు సకలలోక పూజల నందన్! 37

ఆదిదేవ! హే పురాణపురుషా! యఖిల బ్రపంచమునకు నీవున్!
బరమ నిధానము! తెలిసిన వాడవు! బరగ తెలియదగు వాడవునూ!
సర్వోత్తమ స్థానంబును నీవే సకల రూపములు నీవుగదా!
నీవే యీ సకల బ్రపంచమును నిండి యుంటివీ వ్యాపించీ! 38

వాయువు యముడును, నగ్ని జంద్రుడును వరుణుడు నంబుజ గర్భుడునూ!
అంబుజగర్భుకు దండ్రివి నీవే యాతని జన్మకు మూలంబున్!
నీవే గద! యీసర్వ బ్రపంచము నీకు వేల వందనము లివే!
మఱల మఱల వందనములు స్వామీ! మానుగ సాష్టాంగములు నివే! 39

నమస్కారములు ముందు వెనుకలును నమస్కారములు గోవిందా!
అన్నివైపులను నమస్కారములు నంతట వ్యాపించిన నీకున్!
అనంత వీర్యుడవును! విక్రముడవు! నఖిలము నుంటివి వ్యాప్తమునై!
కావుననే సర్వస్వరూపివై సకలమందు నుంటివి కృష్ణా! 40

బ్రమాదముననూ! బ్రణయము వలనను బరిహాసమున యసత్కృతినీ!
విహార శయ్యా భోజనములనూ వివిధ హాస పరిహాసములన్!
ఏకాంతముగా నుండినప్పుడును నితరులతో నున్నప్పుడునూ!
ఏ అవమానము గావించితినో యే యపరాధము జేసితినో
సర్వము క్షమింప వేడుచుంటినీ సరసిజాక్ష! యిదె! వందనమూ! 41

చరాచరంబగు నీ లోకమునకు సరసిజాక్ష! తండ్రివి నీవే!
పూజ్యుడవును మఱి గురుడవు నీవే! బొలుపుగ సర్వశ్రేష్ఠుడవున్!
నీతో సముడగు నధికుడు లేడూ! నీవే సర్వస్వము నాకున్!
ఇక నినుమించిన వాడు ధరిత్రిని నెట్లుండును మఱి యొక్కండున్? 43

అందువలన కృష్ణా! కాయముచే నలరుచు సాష్టాంగము తోడన్!
నమస్కరించుచు నుంటి ముకుందా! నయముగ నన్ను క్షమింపగనూ!
తండ్రివోలె, స్నేహితునికి వోలెను దగ ప్రియుడును క్షమియింపు విధిన్!
నాశరహితుడవునగు శ్రీకృష్ణా! నయముగ నిను నే తెలియకనూ!
ఓ కృష్ణా! ఓ యాదవ! సఖుడా! యొచరగ పిలిచి యలక్ష్యమునన్!
నాయపరాధములన్ని సహించీ నయముగ దయజూడుము దేవా! 44

అదృష్ట పూర్వం బగునట్టిదియును నలరు విశ్వరూపంబును నే
ఆనందంబును జూచి పొందితిని యఖిలేశ్వర! సర్వేశ! మదిన్!
కానీ భయమును గొలుపుచున్నదీ బన్నుగ విరాట్ స్వరూపంబున్!
భయముచేత వ్యథ బొందుచునున్నది బన్నుగ పూర్వపు రూపమునే
జూపుము దేవా! జగదాధారా! సురుచిరముగ సౌమ్యత దనరన్! 45

కృష్ణా! విను నే మునుపటివలెనే కిరీటమును, గద, చక్రమునూ
చేత ధరించిన వానిగ జూడగ మతీ దలంచుచును నున్నాడన్!
సహస్ర బాహో! చతుర్భుజంబుల సహజముగా దర్శన మిమ్మా!
పూర్వరూపమును మఱల ధరింపుము బొలుపుగ నాలుగు భుజములతో! 46

భగవానుండగు గృష్ణుడు పలికెను బన్నుగ పార్థునితో నిటులన్!
తేజోమయమును, విశ్వరూపమును దీరుగ యనంతమైనదియున్!
ఆది యంతమును లేనిదియును మఱి యఖిలము దనలో గలదియునూ!
ఇతరులెన్నడును జూడనిదియును మఱి నిమ్మగ నీపై గల ప్రేమన్!
స్వకీయమును నగు యోగశక్తిచే! సరసత జూపించితి నీకున్! 47

అర్జున! విను! నా విశ్వరూపమును నలరి యెవ్వరును గనలేదూ!
ఈ మనుష్య లోకమున యెవ్వరును నింపుగ గాంచగ లేదుసుమా!
అనుగ్రహంబున జూడ గలిగితివి నలరు నాదు ఘన రూపంబున్!
వేద యజ్ఞ యధ్యయనంబులచే విమల దాన జప దపములచే
ఇట్టి నన్ను జూచుట కెవ్వరికి నిమ్మగ శక్యము గాదుసుమా! 48

భయముగొలుపు యీ విశ్వరూపమును బన్నుగ గాంచుచు కౌంతేయా!
విమూఢ భావము నొందకుమా మఱి వికలత్వంబును జెందకుమా!
నిర్భయుండవును, బ్రసన్న జిత్తుడ పగుము! బూర్వమగు రూపమునే
మఱల నందగను జూడు మర్జునా! మది సంతసమును నందగనూ! 49

సంజయుండు ధృతరాష్ట్రునితోడను సౌమ్యము దొలుకగ నిటులనియెన్!
మహారాజ! ధృతరాష్ట్ర భూవిభూ! మానుగ గృష్ణుం డిట్లు వలికి!
ఆ విధమున దన పూర్వరూపమును నర్జుననకు మఱలను జూపెన్!
మహాత్ముడునునగు మధుసూదనుడును మధుర సౌమ్య రూపము దోడన్!
గలతను బొందిన గౌంతేయుని దా గరుణ వాక్యముల నోదార్చెన్; 50

అర్జును డిటులను వలికె కృష్ణుతో నమ్రత వాక్యముల గూడికొని
కృష్ణా! నీ దగు సౌమ్య రూపమును నిష్టముగా జూచుచు నుంటిన్
మానుషరూపము మఱల జూచితిని మాయమాయె మది కలతయునూ!
నా మనసంతయు గుదుట బడినదీ! నయముగ స్వస్థత నొందితినీ! 51

భగవానుండగు గృష్ణుడు వలికెను బార్థునితో నీ విధముగనూ!
అర్జున! యే రూపమును బ్రస్తుతము నలరి గాంచితివొ యాసక్తిన్!
అట్టిది బహు దుర్లభమైనట్టిది యిట్టె యెవరు గాంచగలేరూ!
సురలద్దానిని జూడ గోరెదరు సురుచిరముగ బహు నాసక్తిన్! 52

ఏరీతిగ నను నీవు గాంచితివొ యింపుగ యా రూపమును మఱిన్
వేదంబులచేగాని, దపసులను విమల ధ్యానములచే గానీ!
యజ్ఞంబులచేగాని జూచుటకు నమల విశ్వరూపమును మఱిన్!
గాంచలేరు యెవ్వరును నర్జునా! కల్మషరహితులు గూడ ననున్! 53

అర్జున! వినుమా! యిట్టి రూపమును నలరిన నను గన్నుల గాంచన్!
అనన్య భక్తిని గూడి మాత్రమే యలరి దెలిసికొనుటకు మఱియున్!
జూచుటకును మఱి ప్రవేశించుటకు సురుచిరముగ వశు దగుచుందున్!
అట్టి వారలే దెలిసికొనియెదరు నిట్టి విశ్వరూపము బార్థా! 54

ఎవడీ లోకమునందు నర్జునా! నింపుగ కర్మల నా కొఱకే
జేయుచుండునో నన్నే నిరతము స్థిరముగ నెందునా సద్భక్తిన్!
సంగవర్జితుండై నాతండును సంగతి యాసక్తిని వీడీ!
సకలభూతముల యందున ద్వేషము సరగున వీడిన వాడెవడో!
అట్టివాడు నను బొందుట కర్హుడు అట్టివాడు నను బొందుసుమా! 55

(విశ్వరూప సందర్శన యోగము – సమాప్తము)

ఓం

# శ్రీ భగవద్గీత

## భక్తి యోగము

### పండ్రెడవ అధ్యాయము

భగవంతుండగు కృష్ణునితోడను బలికె నిటుల నా పార్థుండున్!
ఏ ప్రకారముగ నెల్లప్పుడు మది నింపుగ నిలుపుచు నీ యందే
యే భక్తులు నిను నుపాసింతురో! నింద్రియ గోచరమును గానీ
అక్షరపరబ్రహ్మముధ్యానింతురొ యా యిరు దెగలను యోగమునూ!
బాగుగ యెఱిగిన వారెవరో మఱి బన్నుగ దెలుపుము జనార్దనా! 1

భగవంతుండగు కృష్ణుడు బలికెను పార్థునితో నీ విధముగనూ!
అర్జున! విను నా యందు మనస్సును నలరి నిలిపి ధ్యానముతోడన్!
తదేకనిష్ఠను నుపాసింతురో తరుగని శ్రద్ధను గూడికొనీ!
అట్టి వారలే యుత్తమ యోగులు నిట్టె మదిని నే దలచెదనూ! 2

ఇంద్రియముల నన్నిటిని బాగుగా నిల స్వాధీనము జేసికొనీ
సర్వమందు సమభావము గలిగీ సర్వభూతముల హిత రతియున్!
ఇట్టి దనుచు నిర్దేశింపగనూ గట్టిగ శక్యము గానిదియున్!
ఇంద్రియముల గోచరమునుగానీ యింపుగ మది జింతింపగనూ!
ఆలవికానిదియు, నిర్వికారమును నలరి జలింపని దైనదియున్!
నిత్యమైనదియు, విశ్వ మంతటను సత్యముగా వ్యాపించినదీ!
అట్టిదైన యా యక్షరబ్రహ్మము నిట్టి ధ్యానమును జేయుదురో
అట్టి పుణ్యపురుషులు గౌంతేయా! గట్టిగ నను బొందెదరు సుమా! 3-4

అవ్యక్తంబగు బరబ్రహ్మమున యాసక్తియు గల వారలకున్!
బ్రహ్మమందు నిష్ఠను బొందుటలో బన్నుగ సగుణోపాసకులన్!
మించిన శ్రమ గలుగును నధికముగా నంచితముగ యుండును బార్థా!
ఏలననగ నిర్గుణోపాసనయు నింపుగ నిర్మల మార్గంబున్
దే-హాభిమానమును గలవారలచే నతి కష్టముగా నొందబడున్! 5

అర్జున! యెవ్వరు సకల కర్మలను నలరుచు నా కర్పించుచునూ!
పరమగతిగ నను దలచినవారై బన్నుగ యనన్య చిత్తముతో
నను ధ్యానించుచు నుపాసింతురో నయముగ పావనులగు వారిన్!
చిత్తము జేర్చి నా యందుననూ స్థిరులగు మానవ శ్రేష్ఠులనూ!
మృత్యురూప సంసారాంబుధినీ యతి శీఘ్రముగా వారలనూ
లేవదీయుచున్నాను అర్జునా! లీలగ పైకిని వారలనూ! 6-7

నాయందే నీ మనస్సు స్థిరముగ నయముగ నిలుపుము కౌంతేయా!
నాయందే నీ బుద్ధిని నిలుపుచు నయముగ ప్రవేశపెట్టుమికన్!
నాయందే నివసింతువు బిమ్మట నయముగ సందేము లేదూ! 8

అర్జున! ఒకవేళను నీ మనసును నా ప్రకారముగ నాయందున్
స్థిరముగ నిలుపగ శక్తిలేనిచో జెన్నుగ యభ్యాసంబుననూ
నన్ను బొందుటకు యత్నముజేయుము నయముగ నా స్థితి జేరగనూ! 9

అభ్యాసము నొకవేళ జేయగా నసమర్థుండవు నైతేనిన్ !
నా సంబంధంబగు గర్మంబుల నయముగ జేయుము నాపక్తిన్!
గలవాడవు గమ్మా! కౌంతేయా! కదిలి రమ్ము! సత్కర్మలకై!
అటుల నా కొఱకు గర్మల జేసిన యలరి మోక్షస్థితి నందెదవూ 10

ఇంక నన్ను గూర్చిన యోగంబును నింపుగ యవలబించుచునూ!
యున్న వాడవును దీనిని గూడను మిన్నగ చేయగ జాలనిచో
అటుబిమ్మట నియమింప బడిన యా యలరి మనసు గలవాడవునై
సర్వకర్మఫల త్యాగము సేయుము సర్వేశ్వరునీ మదిదలచీ! 11

అభ్యాసము కంటెను విను మర్జున! యలరి జ్ఞానమది శ్రేష్టంబున్!
జ్ఞానము కంటెను ధ్యానము శ్రేష్టము ధ్యానముకంటెను కౌంతేయా!
కర్మఫలంబును విడుచుట శ్రేష్టము! కమనీయంబగు మార్గమునన్!
అట్టి కర్మఫలత్యాగము జేతను నలరి లభించును శాంతియునూ! 12

సర్వప్రాణులను ద్వేషము లేకను సమబుద్ధిని జూచెడివాడున్!
మైత్రి కరుణయును గల పురుషుండును మమకారంబును, నహంబునూ!
లేనివాడునూ సుఖ దుఃఖంబుల సురుచిరముగ సమభావంబున్!
గలవాడును, నోర్పును గలవాడును, గప్పని సంతృప్తిని గలిగీ
యోగయుక్తుడును, యతాత్ముండునూ దగ దృఢ నిశ్చయమును గలిగీ!
నాయందున యర్పించిన మనసును నయముగ బుద్ధియు గలవాడున్!
నా యందున భక్తియు గలవాడును నయముగ నాతడు నిష్టుండున్!
ఆతడు భక్తుడు నన్ను గాంచునూ! నాతని గాంతును చే నెపుడున్ 13-14

ఎవనివలన యీ ప్రపంచమంతయు నించుక భయమును జెందకనూ
యుండునో యర్జున! లోకము వలనను నిమ్ముగ భయమును జెందకనూ!
యుండునో హర్షామర్ష భయంబులు యుండవొ మది వ్యాకులతయునూ!
అట్టివాడు నాకిష్టుడు ఫల్గుణ! యిష్టుడైనవాడును నాకున్! 15

అనపేక్షుడు మఱి శుచియు, దక్షుడును నలరు నుదాసీనుడు మఱియున్
దిగులు లేనివాడును గౌంతేయా! దీరత సమస్త కార్యములన్!

క ర్తృత్వంబును వదిలిన వాడును గతి యని నను దలచిన వాడున్
అట్టివాడు నా భక్తుడు అర్జున! యిష్టమైన వాడును నాకున్! 16

ఎవ్వడు సంతోషమును నొందడో యెవ్వడు ద్వేషింపడో బరులన్!
శోకంబును మఱి యెవడు బొందడో గాంక్షింపడో మఱి యెద్దియునూ
శుభాశుభంబుల బరిత్యజించునో శుద్ధభావమున నుండెడినో
అట్టివాడు నా భక్తుడు అర్జున! యిష్టమైన వాడును నాకున్! 17

శత్రువులందున, మిత్రుల యందున సముడై యుండునో నాతండున్
మానమునందవమానము నందున మఱి శీతోష్ణము లందుననూ!
సుఖదుఃఖంబుల సమముగనుండునో సురుచిరముగ సంగము లేకన్
యుండునో నిందా స్తుతుల యందునను నుండునో సమభావము తోడన్!
18-19

మనన శీలుడును మౌనముతోడను మఱి దృప్తిని బొందెడువాడున్!
అనికేతనుడును, స్థిరమతియును మఱి అలరి భక్తుడగు నగువాడున్!
నన్నే పరముగ నాశ్రయించినా నా భక్తుడు విను గౌంతేయా!
అట్టివాడు నాభక్తుడు వినుమా! యిష్టమైన వాడును నాకున్! 19

ఎవ్వడు శ్రద్ధామంతుం డగుచును ఎవ్వడు నను బరమని నమ్మి!
నాయందున యాసక్తిని గలిగీ నయముగ యమృత రూపంబున్
నగు నీ ధర్మము నాచరించునో నయముగ భక్తి సుయోగమునన్!
అట్టివాడు నా భక్తుడు నర్జున! యిష్టమైన వాడును నాకున్! 2

# శ్రీ భగవద్గీత

## క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము

### పదమూడవ అధ్యాయము

భగనంతుడగు శ్రీకృష్ణునితో బార్థుడు పలికెను నీ రీతిన్!
ఓకృష్ణా! ప్రకృతిని పురుషునీ నొనరగ క్షేత్రము, క్షేత్రజ్ఞున్!
జ్ఞానంబును జ్ఞేయమును ముకుందా। వీనినన్నిటిని వివరముగా!
దెలిసికొనగ నే గోరుచుంటినీ దీరుగ తెలుపుము నొకటొకటిన్! 1
శ్రీభగవానుడు కృష్ణుడు వలికెను స్థిరముగ కుంతీ పుత్రునితో!
అర్జున వినుమా! యీశరీరమే యలరిక్షేత్రమని యనబడునూ!
దీనిని దెలిసినవాడు బాండవా! దీరుగ క్షేత్రజ్ఞుం డనుచున్!
క్షేత్ర క్షేత్రజ్ఞుల దెలిసినవా యా స్థిరమతులును పివరించెదరూ! 2
సమస్త క్షేత్రములందును ననగా సర్వ శరీరములందుననూ!
క్షేత్రజ్ఞునిగా గూడ నెఱుంగుము క్షేత్ర క్షేత్రజ్ఞుల గూర్చి
జ్ఞాన మేది గలదో భారత విను! జ్ఞానంబది వాస్తవమైనా
జ్ఞానంబనుచును మనసున దలచెద మానసమున దలపుము నీవున్! 3
ఎదియో యెట్టిదొ యా క్షేత్రంబును నెట్టి వికారములును గలవో!
ఏరీతిగ యుత్పన్నమైనదో నెవరో యా క్షేత్రజ్ఞుండున్!
ఎట్టి ప్రభావము గలవాడో మఱి నిట్టి విషయముల నన్నింటిన్!
సంక్షేపముగా అర్జున! వినుమా! సర్వ విషయములు నావలనన్! 4
క్షేత్రము క్షేత్రజ్ఞుల జ్ఞానంబును స్థిరముగ ఋషి ముని యోగులచే!
అనేక విధములుగా దెలుపగబడె అనేక విధముల వేదములన్!
వేఱువేఱుగా వివరింపబడె విశదముగా చందస్సులలో
బ్రహ్మసూత్ర వాక్యములను గూడను బాగుగ నిశ్చయమును జేసి
హేతువులను యుక్తులతో గూడుక ఋజువగు యుక్తులతో గూడన్! 5

పంచభూతములు నహంకారమును బన్నుగ బుద్ధియు బ్రకృతియున్!
పదునొకండు నింద్రియములును అర్జున! బరగ దశేంద్రియములు మనసున్
పంచేంద్రియముల సముదాయంబును నంచిత కోరిక, ద్వేషంబున్
సుఖదుఃఖంబుల దేహేంద్రియముల సురుచిరముగ సముదాయంబున్!
తెలివి, ధైర్యమును గూడినట్టి యీ దీరుగ విషయము లన్నియునూ!
సవికారంబగు క్షేత్రంబునుచును సంక్షేపముగా దెలుపబడెన్! 6-7

తన్ను దాను కీర్తించుకొనకయును దగ మదమును లేకుండుటయున్!
బరప్రాణుల బాధింపకుండుటయు బన్నుగ యోర్పును గలుగుటయున్!
ఋజుత్వంబు మఱి గలిగియుండుటయు ఋత్విజులను మఱిగురువులనూ!
సేవించుటయును, శుచిత్వంబునూ స్థైర్యమాత్మ నిగ్రహములునూ!
గలిగియుండుటయు జ్ఞానం బనబడు గౌంతేయా! విను దెలిపునదీ

ఇంద్రియార్ధముల వైరాగ్యంబును నిమ్ముగ ధరించి యుండవలెన్!
మనహంకారములను దొలగుచునూ మానుగ దూరమునుండవలెన్!
జన్మ మృత్యువుల జరావ్యాధులను జరుగు దోషముల స్మరించుచున్
మాటిమాటికిని స్మరింపగా వలె మానుగ బురుషుడు నెల్లపుడున్!
జ్ఞానంబనునది యిది కౌంతేయా! జ్ఞానులు దీనిని బలికెదరూ!

పుత్ర దార గృహ సంపదలందును బొలుపుగ యనురక్తియు లేకన్!
శుభాశుభంబులు, నిష్టానిష్టము లిమ్ముగ గలిగిన జలింపకన్!
సమభావంబును గలిగి యుండుటయు సమబుద్ధిని భరియించుటయున్!
జ్ఞానంబనునది యిది కౌంతేయా! జ్ఞానులు వీనిని నందెదరూ!

నాయందునను యనన్య భక్తియును నను భజించి సేవించుటయున్!
ఏకాంతంబును నాశ్రయించుటయు యే యాటంకము లేనిదియున్!
నిర్జనస్థానమునందు వసించుట నిర్మలభక్తిని సేవించవన్!
జ్ఞానంబనునది యిది కౌంతేయా! జ్ఞానులు దీనిని బొందెదరూ!

ఆత్మనిష్ఠతో నిరంతరంబును నాత్మ జ్ఞానంబున గూడీ !
తత్త్వజ్ఞానంబును దర్శించీ దగ ప్రయోజనము దెలియుటయున్ !

ఇదియంతయు జ్ఞానం బనియెదరూ బోదురు జ్ఞానులు నీ్త్రోవన్ !
దీనికి వ్యతిరేకంబైనది విను ! దీరుగ యజ్ఞానంబనియున్ ! 8-12
జ్ఞేయంబనగా దెలియదగిన దా జ్ఞేయంబును నే దెలిపెదసూ !
దానిని దెలిసిన యిలలో మనుజుడు దగ దివ్యామృత రూపంబున్ !
మోక్షంబును బొందుచు నున్నాడో ముదమును దెలుపుచు నున్నాడన్ !
అనాదియగు నా పరబ్రహ్మమును నలరి యున్నదని లేదనియున్
సత్తనిగాని యసత్తనిగానీ సవ్యసాచి ! దెలుపగబడదూ ! 13

అట్టి బ్రహ్మమును ఆత్మ యంతటను నలరి పాణి పాదంబులనూ
అంతటయును, గన్నులు శిరములునూ యలరి ముఖంబులు గలదియునూ!
అంతట జెవులును గలదియు ఖాండవ ! యఖిల ప్రపంచం బంతయునూ
యావరించియున్నది కౌంతేయా ! యఖిలభూతముల యందుననూ 14

జ్ఞేయ స్వరూపంబగు నా బ్రహ్మము సకలేంద్రియముల గుణములనూ !
బ్రకాశింపగా జేయును మఱియును బరగ యింద్రియములును లేకన్
దేనిని గూడను నంటనిదియును మఱి దీరుగ సర్వము భరించుచున్ !
సత్త్వరజోగుణ రహితమైనదియును సర్వ గుణములను బొందునదీ ! 15

ప్రాణులకును వెలుపల లోపలనూ బరగ యుండునదియును బార్థా !
కదలనిదియు మఱి కదులునట్టిదియు గడు సూక్ష్మంబై యుండునదీ
అజ్ఞానులకును దెలియబడనిదియు నతి దూరముగా నుండునదీ
అతిదగ్గఱగను నుండునదియునూ యలరుచుండు నతిచిత్రముగా ! 16

విభజింపగ బడనిది భూతంబుల విభజింపబడిన దాని వలెన్ !
గనబడునట్టిది సర్వ ప్రాణులను గరమున సృష్టించుచును మఱిన్
పోషించుచు మఱి లయము జేయునది బొలుపుగ తెలియగవలె దీనిన్
ఆత్మయనగ మద్బ్రహ్మమనుచు నే మానుగ ముందుగ దెలిపితినీ ! 17

ప్రకాశించు సూర్యాగ్ని చంద్రులకు బన్నుగ బ్రకాశ మిచ్చుచునూ
బ్రకాశించెడీ జ్యోతియనుచు మది బరగ దెలియుమా ! కౌంతేయా !
తమస్సుకంటెను వేరైనది సుమ ! దగ యతీతమైనది సుమ్మా !

జ్ఞాన స్వరూపంబైనది మఱియును చిన్మయ రూపంబైనదియున్ !
తెలియదగినదియు జ్ఞాన గుణంబుల దీరుగ నందగ దగినదియున్ !
సకలభూతముల హృదయము లందున్ సరసత యున్నది యనుచు నిలన్
దెలుపగ బడుచున్నది కుంతీసుత ! స్థిరముగ జ్ఞేయంబగు దానిన్ ! 18

ఈ విధముగ క్షేత్రము, జ్ఞానంబును నిమ్ముగ జ్ఞేయం బనునదియున్ !
సంక్షిప్తంబుగ తెలుఫబడినవీ సవ్యసాచి ! నీ కిపుడిచటన్ !
నాదు భక్తుడును వీని దెలిసికొని నా స్వరూపమును బొందుటకున్ !
అర్హుండగుచున్నాడు అర్జునా ! నలరి మోక్షమును నందుటకున్ ! 19

అర్జున ! విను ! ప్రకృతిని-పురుషునీ యాదిలేని వారిగ దెలిసీ !
మనోబుద్ధి యింద్రియముల జేతనూ ! మానుగ జరుగు వికారములన్ !
సత్త్వ రజస్తమ గుణము లనియెడీ సరగున ప్రకృతిచే బార్థా !
గలిగిన వస్తువులని భావింపుము నిల నా మాయగ కౌంతేయా ! 20

కార్య కారణములను గలిగించెడి గల హేతువు ప్రకృతి యనియున్ !
సుఖదుఃఖంబుల భోక్తృత్వంబున సురుచిరముగ నిల బురుషుండున్
హేతువనుచు జెప్పగ బడుచున్నది మతిమంతుడ ! శాస్త్రములందున్ !
దెలియు మర్జునా ! ప్రకృతి బురుషులను దీరుగ వివరములను లెస్సన్! 21

ప్రకృతి నున్నవాడై పురుషుండును ప్రకృతి వలని జన్మించిన యా !
ప్రకృతి గుణంబుల ననుభవించుచును బరవశ మగుచుండును బార్థా !
ఆయా గుణముల గూడికయే కద ! యా జీవునకును నీ ధాత్రిన్ !
ఉత్తమ నికృష్ట జన్మములెత్తుట హేతువుగా నుండును బార్థా ! 22

అర్జున ! పురుషుం డను నాత్మయునూ యలరి శరీరము నందున్నన్ !
శరీరంబుకంటెను వేరైనా సాక్షీభూతుం డంచు మఱిన్ !
భర్తయు, బోక్తయు మహేశ్వరుండని పరమాత్మయు నని శాస్త్రములన్
దెలుపబడుచు నున్నాడు అర్జునా ! దీరుగ దైవజ్ఞుల జేతన్ ! 23

ఎవడీ విధమున బురుషుని యాత్మను నిమ్ముగ గుణములతో గూడీ !
ప్రకృతి యనుచు మది దెలిసికొనునొ మఱి వికృతిగను భావించునొకో !
అతడే విధమున వర్తించిననూ నాతడు జన్మింపడు మఱలన్ !
అక్షయమగు బ్రహ్మంబు నందునూ నాతడు మోక్షము నందు సుమా ! 24

ఆత్మను గొందఱు శుద్ధ మనస్సున నలరి ధ్యాన యోగము వలనన్
దమయందున సాక్షాత్కరించుకొని దన్మయమగు చుందురు పార్థా !
అటులే కొందఱు సాంఖ్యయోగమున నలరి కర్మయోగము జేతన్ !
గొందరు యత్నము జేయుచునుందురు గూరిమి బ్రహ్మమునందుటకై 25

అర్జున ! గొందఱు నీ ప్రకారమున నలరి దెలిసికొన జాలకనూ !
ఇతరుల వలనను విని బరమాత్మను నింపుగ భజించు చుందురిలన్ !
శ్రుతి పరాయణులు నగు వారలునూ సురుచిరముగ యా మృత్యువునూ !
మృత్యురూపమగు సంసారంబును నతివేగంబున దాటుదురూ ! 26

భరతర్షభ ! యీ ప్రపంచమంతయు బన్నుగ స్థావర జంగమముల్ !
పదార్థమేదియు బుట్టుచున్ననూ బ్రకటిత మగునది యంతయునూ
క్షేత్ర క్షేత్రజ్ఞుల గూడికచే కీర్తిమంత ! యిల గలుగుననీ !
కలుగుచున్నదని దెలియుము పార్థా ! గల నిజమంతయు జ్ఞానమునన్ ! 27

సమస్త ప్రాణులయందు సమముగా సర్వేశ్వరు డుండుట గాంచున్
యా ప్రాణుల దేహాదులునూ నలరి నశించినను గూడన్ !
శియింపనివానిగ యే పురుషుడు నయముగ జూచునొ మదియందున్
తడె నిజముగ జూచువాడనియు నాతడె విజ్ఞుడు గౌంతేయా ! 28

సకలభూతముల యందున మిక్కిలి సకలేశ్వరుడగు బరమాత్మన్
వెలయునటుల వ్యాపించి నట్టుగా విమలముగా గాంచును మఱియున్ !
దన యాత్మను దా హింసింపడు గద ! దగ యజ్ఞానికి వలె నరుడున్ !
గావున యర్జున ! సర్వోత్తమ గతి భవ్య మోక్షమును నత డొందున్ ! 29

ప్రకృతి వలనను గర్మల పురుషుడు బన్నుగ జేయుచు నున్నటులన్ !
అట్లే యాత్మకు కర్తకాని విధి యలరి జూచుచుండును మదిలో !
ఆతడె నిజముగ తెలిసినవాడగు నాతడె జూచినవాడగునూ ! 30

వేర్వేరుగ నున్నట్టి భూతములు విలసిత ప్రపంచ మంతయునూ !
ఒక్కదానియందున బరమాత్మను నున్నదానివలె భావించీ !
దానినుండియే విస్తరించుచును దగయుండిన దానిగ మదిలో
వీక్షించునొ యా మనుజుడు బ్రహ్మము విమల మోక్షమును దా నందున్!31

అర్జున ! విను నే నలరి దెలుపునది నాసక్తిని మది గూడికొనీ !
ఆదిలేని వాడగుటచేత మఱి నల ద్రిగుణాతీతుం డగుటన్ !
ఆ పరమాత్మయు శరీరమందున యలరి యుండినను గౌంతేయా !
ఏమి జేయకయు, నేది యంటకయు నింపుగ స్థిరముగ నుండుసుమా! 32

సర్వము వ్యాపించిన యాకాశము సరసత సూక్ష్మంబగు ధూళిన్ !
ఏ విధమున నంటకయుండెడినో నా విధముననే కౌంతేయా !
శరీరమంతయు వెలయుచుండినను సకల శరీరములందుననూ !
అలరు నట్టి పరమాత్మ గుణములను నంటబడకయుండును బార్థా ! 33

కుంతీసుత ! సూర్యుం డొక్కరుడే కూరిమి సమస్త లోకములన్ !
బ్రకాశింపజేయుచు నున్నాడో బ్రవిమలమగు గాంతుల జేతన్ !
అటులే క్షేత్రజ్ఞుండగు బరమాత్మయు నలరి సమస్త క్షేత్రములన్ !
బ్రకాశింపజేయుచు నున్నాడిల బన్నుగ నంటక ముట్టకయునూ ! 34

క్షేత్ర క్షేత్రజ్ఞుల భేదంబును స్థిరముగ ప్రాణుల బ్రకృతియున్!
అవిద్యనుండీ విముక్తి నొందెడి యా మార్గంబును దెలిసికొనీ!
జ్ఞాన చక్షువుల గ్రహించు చుందురొ వినయమున శ్రద్ధాభక్తిన్!
బరమాత్మను బొందుదురు భారతా! భవ్యమోక్షమునునందుదురూ! 35

క్షేత్రక్షేత్రజ్ఞుల విభాగమగు స్థిరమగు యోగము గృష్ణుండున్!
నీరీతిని నర్జునునకు దెలిపెను నలరి కురుక్షేత్రము నందున్!
అనుచు దెలిపె ధృతరాష్ట్ర విభునకును నల సంజయుడును బ్రియమారన్!
దాను వినిన గాంచిన విషయములను దగ ముత్తియములను గ్రుచ్చినటుల్!

(క్షేత్రక్షేత్రజ్ఞవిభాగ యోగముసమాప్తము)

# శ్రీ భగవద్గీత

## గుణత్రియ విభాగ యోగము

### పదునాల్గవ యధ్యాయము

శ్రీభగవానుడు గృష్ణుడు బలికెను శ్రీకరముగ పార్థునితోడన్!
జ్ఞానంబులలో నుత్తమజ్ఞానము వినుము! మఱల దెలుపుచునుంటిన్!
దేని తెలిసి మునులందఱు గూడను దీరుగ మోక్షము నలదుకొని!
పరబ్రహ్మమును బొందిరో దానిని బన్నుగ వివరించెద బార్థా! 1

ఇట్టిజ్ఞానమును నాశ్రయించి మఱి నింపుగ నను బొందిన వారై
సృష్టికాలమున జన్మింపకనూ సురుచిరముగ ప్రళయము నందున్!
నశింపకను యందురో కౌంతేయా! రహి పునరావృత్తియులేకన్!
నా స్వరూపమును బొందుదు రర్జున! నాలో నైక్యము నొందెదరూ! 2

బహుగొప్పది యగు మూలప్రకృతియును బన్నుగ యర్జున! ప్రాణులకున్!
ఉత్పత్తికి స్థానంబని దెలియుము యొనరగ యద్దానిని నేనున్!
గర్భకారణంబైన బీజమును గడు రక్తిని నుంచుట చేతన్!
సకల భూతముల యుత్పత్తియునూ సంభవించుచున్నది పార్థా! 3

సమస్త జాతుల యందున నర్జున! సరసత నెట్టి శరీరములున్!
నుద్భవించుచుండునొ మఱి వానికి నుద్భవస్థానము బ్రకృతి సుమా!
ప్రకృతినే మాయగ భావింపుము బన్నుగ మాతృస్థానమునన్!
బీజము నుంచెడి తండ్రిని నేనే పితృస్థానమని దలపు మదిన్! 4.

ప్రకృతివలన బుట్టిన గుణంబులగు బన్నుగ సత్వ రజస్త్వమముల్!
మూడుగుణములును నాశరహితుడగు ముదమున నాత్మను దేహమునన్!
బంధించుచునున్నవి కౌంతేయా! ప్రబలమైన యనుబంధమునన్!
ఏ విధముగ బంధించుచున్నవో యింపుగ వినుమా! యాసక్తిన్! 5.

సత్త్వ రజస్త్వమ గుణములలోపల సత్త్వగుణము నిర్మలమౌటన్!
ప్రకాశకంబును యనామయంబును పార్థా! యగుటను క్రమముగనూ!
ఇంద్రియసుఖముల యాసక్తిని మఱి నిమ్ముగ జ్ఞానమునందగనూ!
యాసక్తిని బంధించు చున్నదీ యలరి జీవునీ దేహమునన్! 6.

రజోగుణము రాగాత్మక మైనది రహి కోరికలను గూడినదీ!
దృశ్య విషయముల బ్రీతిని జేయుచు దీరుగ తృష్ణనుగలిగించున్!
దెలియుమర్జునా! కర్మలయందలి గల యాసక్తిని దేహమునన్!
ఆత్మను బంధించుచునున్నది సుమ! యలరి మాయచే గూడికొనీ! 7

తమోగుణము నజ్ఞానమువలనను దగ గలుగును విను! కౌంతేయా!
సర్వప్రాణులకు నవివేకంబును సరగున జేయును జీకటినీ!
పరాకు, సోమరితనము, నిద్రయును బన్నుగ క్రోధంబుల జేతన్!
ఆత్మను బంధించుచు నున్నది సుమ! యలరి మాయచే దేహమునన్! 8

సత్త్వగుణము మఱి సుఖంబునందును సరి రజస్సు కర్మమునందున్!
తమోగుణము జ్ఞానమట వివేకమును దగ గప్పుచు బ్రమాదమునన్!
జీవునిగప్పుచు జేర్చుచున్నవీ స్థిరముగ దేహము నందుననూ!
ఆశ్చర్యంబిది యర్జున! వినుమా! యలరి ప్రకృతిని మాడుచునూ! 9

అర్జున! వినుమా! సత్త్వగుణంబును నలరి బలము గలిగెడి వేళన్!
రజో దమో గుణముల రెండింటిని రయముగ నణచి ప్రవర్తించున్!
అటులే రజస్సు సత్త్వదమంబుల నణచి ప్రవర్తించుచు నుండున్!
ఆ రీతిని దమమును నణచుఅల సత్త్వరరజస్సుల నణచున్! 10

ఈ దేహంబున సర్వద్వారముల నింపగు బ్రకాశ రూపమునన్
బుద్ధి వృత్తి రూపంబగు జ్ఞానము బొలుపుగ గలుగుచు నుండెడినో!
అట్టి సమయమున జ్ఞాన విద్యలును నలరుచు నుండునా కౌంతేయా!
సత్త్వగుణము బెంపొందు చున్నదని సరసరీతి దెలియుము పార్థా! 11

రజోగుణము బెంపొందెడి వేళను రయమున మనుజుని యందుననూ!
లోభంబును, గార్యముల బ్రవృత్తియు లోలత నిషిద్ధ కర్మములన్!
బ్రారంభించుట, మనశ్శాంతియును బన్నుగ యింద్రియ నిగ్రహమున్!
లేకుండుట మఱి యాశయనునవియు లీలగ గలుగుచు నుండు మదిన్! 12

కురువంశీయుడ! అర్జున వినుమా! కూరిమి తమస్సు మనుజునిలో
వృద్ధి బొందునపుడును వెలయును సుమ! వేగము నవివేకంబు మఱిన్!
బుద్ధి మాంద్యమును సోమరితనమును బూనిక మూఢత్వము మఱియున్
అజాగ్రతయు మఱి యజ్ఞానంబును ననునవి గలుగుచు నుండు సుమా! 13

సత్త్వగుణము నభివృద్ధిని నందగ సాత్విక పురుషుడు మృతినందన్
ఉత్తమజ్ఞానుల లోకము అందును నుత్తమ జన్మల నత డందున్
బరిశుద్ధములగు లోకములందును బావనంబులగు గర్మలచే
సాధు సజ్జనుల బరివారంబుల సంస్కృతి బరులకు జన్మించున్ 14

రజోగుణము నభివృద్ధిని బొందగ రహిమానవుడును మృతినందన్!
కర్మసంగులగు వారలందునను మర్మముగా జన్మించు నిలన్!
అటులే దమమును వృద్ధిబొందగా నలరి మానవుడు మృతినందన్!
మూఢులందు బశుపక్షులయందును మొరటునిగా నాతడు బుట్టున్! 15

సాత్త్వికమగు సుకృతమున బార్థా! సాత్త్విక గుణసంబంధబుననూ
నిర్మల సుఖంబు ఫలమని జెప్పిరి నిఖిల శాస్త్రముల నీతి నిదుల్!
రజోగుణము గర్మమునకు దుఃఖము రహి ఫలంబనియు, దమసునకున్
అజ్ఞానము ఫలమనియు దెలిపిరీ యలరి జ్ఞానులి శాస్త్రమునన్! 16

అర్జున వినుమా! సావధానముగ యలరి సత్త్వగుణమునను నిలన్!
జ్ఞానంబును మది గలుచునున్నది జ్ఞాన దీపమను గాంతులతో
రజోగుణము వలనను గౌంతేయా! రయమున లోభంబును గలుగున్
తమోగుణమునను భ్రమ, యజ్ఞానము దగ గలుగుచునున్నవి వరుసన్! 17

సత్త్వ గుణము గలవారు ఫల్గుణా! సరసత మరణానంతరమున్
ఊర్ధ్వలోకముల కేగుచు నుందురు నురుసౌఖ్యములను నందుచునూ
రజోగుణము గలవారు అర్జునా ! రహి మానుష లోకంబుననూ
తమో గుణంబును గలవారలు నిల దగ యల్పములగు జన్మలకున్!
అధోలోకముల జనుచున్నారలు నలరుచు బశు బక్ష్యాదులుగన్! 18

వివేకవంతుడు గుణముల కంటెను విశదముగా నితరంబులనూ!
కర్తనుగా భావింపడొ మఱియును రక్తి దనను గుణముల కంటెన్
వేఱగువానిగ దెలియు చుండునో విమలుండగు నా బురుషుండున్!
నా స్వరూపమును మోక్ష రూపమును నయముగ బొందుచునున్నాడున్!19

దేహోత్పత్తికి గారణంబులగు దీరుగ గుణత్రయంబులనూ
దాటి పుట్టుకయు జరా మృత్యువులు దగ దుఃఖంబులు నను వలచేన్!
విడువ బడిన వాడై మోక్షంబును విమల మరణ రహి తాత్మస్థితిన్
బొందుచుండు బురుషుడు గౌంతేయా! బొలుపుగ యమృత స్థితినందున్! 20

అర్జునుండు పలికెను గృష్ణునితో నలరి వినయమున నంజలితో
గృష్ణా! నీ మూడింటి గుణములను సాక్షాత్ దాటినవాడు మరిన్!
ఏ లక్షణముల గూడి యుండు నిల యెట్టి వర్తనము గలిగుండున్?
ఈ గుణత్రయము నతడే విధముగ నిర్మలముగ దాటగ గలుగున్! 21

భగవంతుండగు కృష్ణుడు పలికెను పార్థునితో నీ విధముననూ!
సంప్రాప్తంబగు సత్త్వ గుణంబగు సంబంధంబగు ప్రకాశమున్!
సుఖమునుగాని యపేక్షింపడో, సురుచిర రజస్సు బంధమునన్
కార్యప్రవృత్తిని దగ కోరకనూ గడు దూరము వర్తించుచునూ!
తమోగుణము సంబంధము వలనను దగ మోహంబును నిద్రలనూ!
ద్వేషింపడొ నవి తొలగిపోయినను దీరుగ గోరడొ వాని నికన్! 22-25

తటస్థునికివలె నున్నవాడునై దగ యాగుణముల జేతను దా
చలింపబడకుండునొ యా పురుషుడు సరసత యా గుణముల మూటిన్!
ప్రవర్తించుచును నున్నవనియునూ బన్నుగ దెలియునొ మదియందున్!
ఏ పరిస్థితుల యందు జలింపక యిమ్ముగ నిశ్చలముగ నుండున్! 23

మరియు నెవడు సుఖదుఃఖములందున మానుగ సమభావము గలిగీ
యుండుబాడు మరి యాత్మయందునను నిండు మదిని యుండెడి వాడున్!
మట్టిగడ్డ, రాయియు, బంగారము మానుగ సమమని మదిదలచున్!
ఇష్టానిష్టములను సమభావము నీర్ష్య లేక యుండెడి వాడున్! 24

ధైర్యవంతుడును సకల, కార్యముల ధీరత కర్తృత్వపు బుద్ధిన్!
వదులువాడు మరి కామ్య కర్మలను మది దృజించెడీ బురుషుండున్!
కర్మంబుల దృజియించి యెల్లపుడు గాఢ బ్రహ్మనిష్ఠను నుండున్!
అట్టివాడు మరి గుణాతీతుడని నలరి దెలుపబడు జ్ఞానులచే! 25

అచంచలంబగు భక్తి యోగమున యలరి యెవడు నను సేవించున్!
అతడీ గుణముల దాటివైచునూ యతడే మోక్షమునందు దుదిన్!
ఆతడు బ్రహ్మము దానగుటకునూ యలరి సమర్థుండగును దుదిన్
జీవన్ముక్తుడు నగు గౌంతేయా స్థిరముగ నను బొందును పార్థా! 26

నాశరహితమును నిర్వికారమును శాశ్వత బ్రహ్మస్వరూపంబున్!
దుఃఖ మిశ్రితముగాని యచంచల దురభిమాన రహితంబును నే
నిరతిశయానంద స్వరూపమును నిశ్చల బ్రహ్మ స్వరూపంబున్!
ఐయియున్నాడను గుంతీపుత్రా! కూరిమి దెలియుము నను భక్తిన్! 27

'ఈ విధి గుణత్రయా విభాగమును నింపుగ యా మధుసూదనుడున్!
ఆ యర్జునునకు నుపదేశించెను నలరి కురుక్షేత్రము నందున్!'
అనుచు దెలిపె ధృతరాష్ట్ర విభునకును నల సంజయుడును బ్రియమారన్
చాను వినిన గాంచిన విషయములను దగ ముత్తియములను బేర్చిటుల్! 28

(గుణత్రయ విభాగ యోగము సమాప్తము)

ఓం

# శ్రీ భగవద్గీత

## పురుషోత్తమ ప్రాప్తి యోగము

### పదిహేనవ అధ్యాయము

శ్రీ భగవానుండగు శ్రీకృష్ణుడు స్థిరముగ వలికెను నర్జునుతో!
అర్జున! వినుమా! పైని వ్రేళ్ళు మరి నలరి దిగువ కొమ్మలుగలదీ!
వేదంబులు బర్ణములు గలదియును విమలంబగు సంసారమనూ!
రావిచెట్టు నాశములేనిదియును రమ్యజ్ఞాన పర్యంతమునూ!
పెద్దలు తెలుదు రీ విధి పాండవ! ప్రియముగ వేదార్థంబు నిటుల్
తెలిసికొనుచు నున్నాడో యెవ్వడు దెలిసిన వాడగు దత్త్వమునూ! 1

ఆ సంసారపు వృక్షము, కొమ్మలు, నలరి సత్త్వ రజస్తమములనూ
వృద్ధిబొందినవి, విషయము లనియెడి పార్థా! చిగుళ్ళు గలదియునూ!

క్రిందికి మీదికి వ్యాపించినదియును గ్రీడగ మానవలోకమునన్!
కర్మబంధముల గలుగజేయునది క్రమముగ క్రిందికి మీదికిన్!
విస్తరించి దృఢముగ నాటుకొని విమలముగా నున్నది చూడన్! 2

ఈ సంసారపు వృక్ష స్వరూపము నీలాగున యీ లోకమునన్!
తెలియగ బడకున్నది కుంతీ సుత! దీరుగ సంసారుల జేతన్!
ఆది యంతములు గనబడకున్నవి మధ్యమ స్థితియును గనబడదూ!
అసంగమను బలమైన ఖడ్గమున నలరి నఱుకవలె వృక్షమునూ 3

అటుబిమ్మట నే స్థానము జేరిన యలరి వెనుకకును మరి రారో!
ఎవరివలన సంసార వృక్షమును నిల ప్రవృత్తి వ్యాపించినదో!
అట్టి యాదిపురుషుని బరమాత్మను నిట్టి శరణమును బొందెదనూ!
ఇట్టి భావమున యా పరమాత్మను గట్టిగ వెదుకగ వలె భక్తిన్! 4

అహంకారమును, నవివేకంబును నలరి లేని వారలు బార్థా!
దృశ్య పదార్థంబుల నాసక్తియు దోషము దొలగిన వారలునూ!
ఆత్మజ్ఞానము గలవారలునూ! యాశ దొలంగిన వారలునూ!
సుఖదుఃఖంబుల ద్వంద్వంబులనూ! సురుచిరముగ తొలగిన వారున్!
అట్టి జ్ఞానులే యవ్యయ బ్రహ్మను నా మోక్షంబును బొందెదరూ! 5

ఆస్థానంబును సూర్యుడుగానీ యగ్నిగాని, చంద్రుడుగానీ
ప్రకాశింప జేయగ జాలరు సుమ ! బ్రవిమల కాంతుల బరమాత్మన్ !
దేనిని బొందినచో గౌంతేయా ! దిరిగిరారా ! లోకంబునకున్ !
అదియే సుమ ! నా స్థాన మర్జునా ! యదియే మోక్షం బనబడుమా ! 6

నా యంశం బగు ననాది నిత్యము నయముగ జగతిని జీవుండై
ప్రకృతియందు గల యింద్రియములనూ బన్నుగ యాకర్షించుచునూ
త్వక్, చక్షువులును, శ్రోత్ర జిహ్వలును దగ ఘ్రాణంబు మనంబులనూ !
ఆరింద్రియముల నాకర్షించుచు నలరుచుండు జీవుండు నిలన్ ! 7

దేహేంద్రియముల ప్రభువగు జీవుడు దేహము విడిచెడి సమయమునన్ !
నూత్నశరీరము నందునప్పుడును యత్నమునను బంచేంద్రియముల్,
మనసును నను నాజించిని గైకొని మధురవాసనల వాయువులున్
గ్రహించి వెడలెడి బందంబుననూ గ్రహించి వెడలుచు నున్నాడున్ ! 8

ఈ జీవుడు శ్రోత్రమును, నేత్రమును, నిమ్ముగ చర్మము, నాలుకనూ,
ముక్కును, మనసును నాశ్రయించుకొని ముదముగ శబ్దాదులను మఱిన్ !
విషయంబుల దా ననుభవించుచును వేడుక నందుచు నున్నాడున్ ! 9

ఒక శరీరమున నుండి జీవుడును, నొక దేహమునకు దరలుటయున్ !
ఒక శరీరమున నుండుటయును మఱి యొప్పుగ విషయము లందుటయున్ !
గుణత్రయంబును గూడిన వాడును గూరిమితో నీ జీవాత్మన్
అజ్ఞానులు మఱి తెలియగజాలరు నలరుచు గాంతురు జ్ఞానులునూ ! 10

సాక్షాత్కారము నందగ యాత్మను సంస్కృతిపరులై యోగులునూ !
తమయందున నున్నట్టి యాత్మనూ దగ దర్శించుచు నుందురుగా !
అటుల ప్రయత్నము జేయుచుండినను అవివేకులు జంచలబుద్ధిన్
ఆత్మను దర్శింపగజాలక మఱి యలత కలత నొందెదరు మదిన్ ! 11

సూర్యునియందున దేజస్సెటులను సురుచిరముగ యీ లోకంబున్ !
ప్రకాశింపగా జేయుచున్నదో బన్నుగ చంద్రుని యందుననూ !
అగ్నియందు నే తేజముగలదో యా తేజస్సును గౌంతేయా !
నా దేజస్సని యెఱుగుము దానిని నయముగ నా యంశంబనియున్ ! 12

భూమియందు నే బ్రవేశించియును భుజబలశక్తిని భూతములన్ !
ధరించుచుంటిని విను కుంతీసుత ! ధర్మము రక్షించుచునుంటిన్ !
రసస్వరూపుడ జంద్రుడనై నే రసముల సస్యములన్నిటినీ !
పోషించుచు నున్నాడ ఫల్గుణా ! పూర్ణస్నేహమున యోషధులన్ ! 13

నేనే వైశ్వానరుడనుగానయి నిరతము జఠరాగ్నియు నగుచున్ !
ప్రాణుల యొక్కయు శరీరంబులను బన్నుగ నే నాశ్రయమందీ !

ప్రాణాపానవాయువు జేతను బన్నుగ నాలుగువిధములు నే !
అన్నంబును బచనంబు జేయుచును నున్నాడను ఓకౌంతేయా ! 14
సకల భూతముల హృదయములందున సన్నివిష్టుడను బరంతపా !
స్మృతి జ్ఞానంబులు దెలివి మఱపులును నీతి గలుగుచున్నవి నాచే !
సర్వవేదముల జేత బాండవా ! సరసత దెలియగ బడువాడన్ !
వేదంబుల నెఱిగిన వాడను నే విమల బురుషుడను నేను సుమా ! 15

ఈ ప్రపంచమున నిరువురు బురుషులు నిమ్ముగ గలరో ! బాండుసుతా !
క్షరుడనియును మఱి యక్షరుడనియును సౌమ్యరీతి దెలిపిరి యార్యుల్
సమస్తప్రాణుల దేహంబులనూ సరసత క్షరుడని బలుకుదురూ !
కూటస్థుండగు జీవుని బిలుతురు కూరిమి యక్షరుడనియు మరిన్ ! 16

ఎవడు మూడు లోకములను నిలిచీ నింపుగ భరియించుచు నుండున్ !
నాశరహితుడును, జగన్నియంతయు నట్టి యీశ్వరుడు గుంతిసుతా !
క్షరాక్షమలు నా యిద్దరికంటెను సరసత వేఱగువాడు నగూ
ఉత్తమ పురుషుడు బరమాత్మయనీ యురుగుణవంతులు దెలిపెదరూ ! 17

క్షరస్వరూపుని మించినవాడును సరసత యక్షర రూపుండున్ !
జీవునికంటెను శ్రేష్ఠుండను నయి స్థిరముగ యున్నందున నేనున్
ఈ ప్రపంచమున యందరి జేతను నింపుగ వేదము లందుననూ !
పురుషోత్తమునిగ ప్రసిద్ధి నొందితి పూర్ణపురుషుగా శాస్త్రములన్ ! 18

ఎవ డజ్ఞానము లేనివాడవై నీరీతిని బురుషోత్తముగా
నన్ను నెఱుంగుచు నున్నాడో మరి నయముగ సమస్తమును దెలిసీ
పూర్ణ హృదయమున సర్వవిధములను బొలుపుగ భజియించును నన్నున్
౦దుకొందు నే నతని హృదయమున జిందగ ప్రేమయు దొంతరగా! 19

అనఘా యర్జున ! యీ ప్రకారమున యీ రహస్యమగు శాస్త్రంబున్ !
నీకు దెలిపితిని నిర్మలమతితో నిఖిల శాస్త్రముల సారమునూ !
దీనిని బక్కగ దెలిసినవాడును జ్ఞానవంతుడును సజ్జనుడున్ !
కృతకృత్యుడు గాగలడు అర్జునా ! కూరిమి యాచరణంబుననూ ! 20

'శ్రీ పురుషోత్తమ ప్రాప్తియోగమును శ్రీకరము'గ శ్రీకృష్ణుండున్ !
ధనంజయునకును నుపదేశించెను దగ కురుక్షేత్రము నందుననూ !
అనుచు దెలిపెనా ధృతరాష్ట్రునకును నలరుచు సంజయుడు నిటున్ !
దానువినిన గాంచిన విషయములను దగ ముత్తియములను బేర్చినటుల్ !

(పురుషోత్తమ ప్రాప్తియోగము సమాప్తము)

# శ్రీ భగవద్గీత

## దైవాసుర సంపద్విభాగ యోగము

### పదునాఱవ యధ్యాయము

శ్రీభగవానుండగు శ్రీకృష్ణుడు శ్రీకరముగ బార్థునితోడన్ !
దైవాసుర సంపద్విభాగ యోగము సరసత వినరించుచును నిటుల్
అర్జున ! భయ మది లేకయుండుటయును అంతఃకరణ విశుద్ధియునూ !
జ్ఞానయోగమున నుండుటయును మరి జ్ఞాన యజ్ఞమం దుండుటయున్ !
దానము బాహ్యేంద్రియ నిగ్రమును బన్నుగ దపస్సు నార్జవమున్ !
వేదశాస్త్రములుముల యధ్యయనంబును విమల మృదుత్వము గలుగుటయున్! 1

అహింస, మరియును సత్యము బలుకుట నల క్రోధము లేకుండుటయున్ !
త్యాగబుద్ధియును, శాంత భావమును, దయాస్వభావము గలుగుటయున్ !
కొండెంబులు మరి జెప్పకుండుటయును గూరిమి యోరుపు గలుగుటయున్!
విషయలోలతయు లేకుండుటయును విమలత్వము గలిగుండుటయున్ ! 2

ధర్మ విరుద్ధములగు కార్యములను దగసిగ్గును గలిగుండుటయున్ !
చంచల స్వభావమును లేకుండుట స్థిరధైర్యము గలిగుండుటయున్ !
ప్రతిభ, బ్రహ్మదేజంబును గలుగుట బాహ్యాంభ్యంతర శుచిత్వమున్ !
ద్రోహ చింతనము లేకుండుటయును స్వాతిశయము లేకుండుటయున్
అభిమానము గర్వము లేకుండుట యాత్మస్తుతియు లేకుండుటయున్ !
అను సుగుణంబులు దైవసంపదను నభిజాతుండగు వానికినీ
గలుగుచున్నవీ ! ఓ కౌంతేయా ! కర్మగతిని జన్మింపగనూ ! 3

అర్జున వినుమా ! డంబము, గోపము అభిమానము మరి గర్వంబున్ !
కాఠిన్యము నవివేకంబను నవి గల యీ దుర్గుణములు బార్థా !
అసురసంపదను బుట్టిన వానికి నలరి గలుగుచున్నవి వినుమా !
దైవీసంపద నీవు బుట్టితివి ! దగ శోకింపగ బనిలేదూ ! 4

పరిపూర్ణంబగు దైవీసంపద బంధనివృత్తిని గతిగించున్ !
అసురీసంపద బంధంబులనూ యలరి గలుగజేయును వృద్ధిన్ !
నిశ్చయింపబడినది యిట్టులనూ ! నీవు నిర్మలం బైనట్టి
దైవీబంపదయందు బుట్టితివి దగ శోకింపగ పనిలేదూ ! 5

వినుమా ! యర్జున ! యీ ప్రపంచమున విమల దైవ సంబంధమునూ !
అసురములగు సంబంధ గుణములను నలరి రెండు విధములునైనా
ప్రాణుల సృష్టులు గలవు అర్జునా ! బన్నుగ దైవీ సంపదనూ !
సవిస్తరంబుగ దెలుపబడినదీ సరసత యాసుర సంపదనూ !
దెలుపుచుంటి వినుమా ! కౌంతేయా ! దీరుగ రాక్షస ప్రవృత్తినీ ! 6

అసురభావములు గల జనములు మరి యమలభావములు దెలియడుగా !
ధర్మాధర్మ ప్రవృత్తులుగానీ ధార్మికతను వారెఱుగరుగా !
శుచిత్వంబు, నాచారపరత్వము సురుచిర సత్యము దలపరుగా !
సత్కర్మానుష్ఠానము మరియును సత్శీలత యుండదు బార్థా ! 7

జగమంతయు మఱి యసత్యమనియును జగమున బ్రతిష్ట లేదనియున్!
ధర్మాధర్మ వ్యవస్థలు లేవని దగ యీశ్వరుడును లేడనియున్!
కామహేతువే గలదై లోకము గల స్త్రీ పురుషుల గలయికచే
గలిగిన దనియును నీజగత్తునకు గల కారణమును లేదనియున్
అనుచు బలుకుదురు నసురసంపదను నల జన్మించిన వారలునూ! 8.

ఇట్టి దృష్టినే యవలంబించుచు నీశ్వరుండు మఱి లేడనుచున్!
నష్టాత్ములు మఱి యల్ప బుద్ధులును గష్టంబులు గలుగగ జేయన్!
ఈ లోకమునకు నహితులు వారును నిమ్ముగ శత్రువులగు వారున్!
ప్రభవించుచు నుందురు లోకంబున బన్నుగ వినాశమును జేయన్! 9.

దుష్పూరంబగు డంబముజేతను దురభిమానమును డంబముతో
మదమును నవివేకము గలవారై నలరుచు జేయుచు గ్రూరములున్!
అపవిత్రముఁగు నీచ కార్యముల నలరుచు జేయుచు దుర్మదులై
వర్తించుచునున్నారు బాండవా! కర్తలు దామే యనుకొనుచున్! 10.

పరిమిత మనునది లేనిది మఱియును బ్రళయము వఱకును విడువనిదీ!
విషయ చింతనల యాశ్రయించెదరు విమల పథంబుల నడువకనూ!
కామమె పురుషార్థంబని దలతురు కర్మ వేఱొకటి లేదనుచున్!
అట్టివారలే యసుర సంపదను నలరి జనింతురు గౌంతేయా! 11.

ఆశాపాశములను బద్ధులునై యలరి కోరికలను గోరుచునూ!
అట్టికామముల ననుభవించుటకు నన్యాయములగు గార్యములన్!
కామక్రోధముల నాశ్రయించు కొని కడు దుష్కర్మల జేయుచునూ!
అర్థసంచయము జేయుచుందురూ యారని దాహముతో జగతిన్! 12.

ఈ కోరిక నే నిపుడు బొందితిని యీ కోరిక నికమీదటనూ!
పొందగలను; నేనింత ధనంబును బొందితి; మఱి యింకెంతయునూ!
ధనసంపదలను సంపాదించెద ధన కోశంబులు నిండారన్!
నవరత్నంబుల రాశులు బోసెద నాసరి యెవ్వరును లేకన్! 13.

ఈ శత్రువునూ యిపుడు వధించితి యింక మిగులు శత్రులగూడన్!
జంపగలను; నాశక్తి యమోఘము జయ్యన జంపెద నందఱినీ!
నేను బ్రభుండను; ధనవంతుడనూ! నిఖిల భోగముల రమియింతున్!
దలచిన కార్యము దగ నెఱవేర్చెద దగ బలవంతుడ! సుఖుడను నే! 14

గొప్ప కులంబున జన్మించితి నే కూరిమి నాతో సరియెవరూ?
యజ్ఞయాగముల నే జేసెదనూ! యలరి దానముల జేసెదనూ!
ఆనందంబును ననుభవించెదను సకల సుఖంబులనందెదనూ!
ఈ ప్రకారమున యజ్ఞానముచే నిమ్ముగ భ్రమ నొందిన వారున్! 15

అనేక విధముల చిత్త చంచలత నలరుచు నుండెడి వారలునూ!
మోహజాలమున గూడినవారలు ముదమున సంసారము నందున్!
కామభోగముల యందాసక్తిని గడు మునుగుచు దేలెడివారున్!
అసురప్రకృతిని బుట్టిన వారలు నపవిత్రమునగు నరకమునన్!
బడుచున్నారలు అర్జున! వినుమూ! బన్నుగ బంధము లందుననూ! 16

తమ్ము దాము గొప్పగ భావించుచు దగు వినయంబును లేకయునూ!
ధనము గల దనుచు విర్రవీగుచును దగ యితరుల నిరసించుచునూ!
అహంకార బలదర్పంబులతో నంతట దమ యధికారమనీ!
కామక్రోధముల నాశ్రయించుకొని కమ్మని సుఖముల గోరుచునూ! 17

తమ దేహంబుల బరులదేహముల దగ సాక్షిగ యుండెడి నన్నున్!
ద్వేషించెడివారును గౌంతేయా! దీరుగ యసూయ బరులగుచున్!
అసుర సంపదాపరులగు వారును నశాస్త్ర పద్ధతి దంబములో
నామమాత్రమగు యజ్ఞంబులనూ నయముగ జేయుచునుందు రిలన్! 18

సకలభూతముల గలయాత్మను నను సారెకు ద్వేషించెడి వారున్!
క్రూరులు మఱియును బాపకర్మలును కుటిలురు నగు మనుజాధములన్!
జనన మరణ సంసార మార్గముల యనయము నసుర బధంబులనూ!
నీచజన్మలను ద్రోసి వైచెదను నిరసించుచు దూరముగా వారిన్! 19

అసుర జన్మలను బొందిన వారలు అర్జున! ప్రతి జన్మము నందున్!
ననుబొందకయే నీచ జన్మలను నయముగ బొందుచు మూఢాత్ముల్!
అంతకంటె మఱి నీచ జన్మలను వింతకాదు జన్మించెదరూ!
యసురీ సంపద యనగా నిట్టిది! యలరి వినుము! గుంతీపుత్రా! 20

కామ క్రోధ లోభంబులు మూడును గలవు నరకమును జేర్చుటకున్!
మూడు విధములగు నరకద్వారములు మూఢుని జేయును మానవునీ!
ఇవి జేయును జీవునకును నాశము నీ మూడింటిని విడువవలెన్!
కామ క్రోధ లోభంబులు మూడును గడు యాసురి సంపద అనుచున్!
నరకంబునకును ద్వారము అనుచును నయముగ దెలిపిరి శాస్త్రవిదుల్! 21

కామ క్రోధ లోభము అనునట్టి గడు చీకటి ద్వారంబులనూ!
విడుచునట్టి మానవుడు భారతా! విపుల మోక్షమును దరిజేరున్!
తనకు దాను హితమును జేసికొనీ ధన్యుడు నగుచున్నాడు భువిన్!
సర్వోత్కృష్టంబగు మోక్షంబును దనకు దానె బొందును పార్థా! 22

ఎవడు శాస్త్రవిధి విడిచిబుచ్చునో యెవడు నిచ్ఛవచ్చిన రీతిన్!
ప్రవర్తించునో యట్టి మానవుడు బన్నుగ పురుషార్థంబులనూ!
ఇహ పరంబులను నందగ నేరడు నిమ్ముగ యుత్తమ గతిని మఱిన్!
బొందగ నేరడు కౌంతేయా! మఱి బొందును నరక ద్వారంబున్! 23

కార్యాకార్యము నిర్ణయించెడి కర్తవ్యంబున బురుషునకున్!
ప్రమాణమై యుండును శాస్త్రంబులు బన్నుగ మార్గము జూపుటకై
కావున శాస్త్రమునందు దెలిపినా కర్మ సూత్రముల గమనించీ!
నీ వీ లోకమునందు గర్మలను నింపుగ జేయుము గౌంతేయా! 24

'దైవాసుర సంపద్విభాగ యోగము నలరుచు నా మధు సూదనుడున్!
ధనంజయునకును నువదేశించెను దగ గురుక్షేత్రము లందుననూ!'
అనుచు దెలిపె నా ధృతరాష్ట్రునకును నమృత సుమధుర వాక్యములన్
దాను వినిన గాంచిన విషయములను దగ ముత్తియములను జేర్చినటుల్! 25

(దైవాసుర సంపద్విభాగ యోగము సమాప్తము)

ఓం

# శ్రీ భగవద్గీత

## శ్రద్ధాత్రియ విభాగ యోగము

### పదునేడవ అధ్యాయము

అర్జును డిటులను వలికె గృష్ణుతో నంజలితో వినయము దోడన్
కృష్ణా! యెవ్వడు శాస్త్రము నొదిలి యిష్టదేవతను గడు శ్రద్ధన్!
బూజించెదరో వారి యొక్క స్థితి బొలుపుగ సాత్త్వికమా? లేకన్!
రాజసమా? మఱి దామసమా? మఱి రమ్యముగా దెలుపుము నెదియో? 1

శ్రీ భగవానుడు వాసుదేవుడును శ్రీకరముగ నిటులను వలికెన్!
బార్థుని మది సందేహముబాపుచు బన్నుగ రమ్యాక్షరములతో!
పార్థా! విను! బ్రాణుల స్వభావమును బరగ పూర్వ సంస్కారమునన్!
గలిగినట్టి యా శ్రద్ధ భారతా! నల సాత్త్విక రాజసములనీ!
తామస మనియును మూడు విధములుగ దగ నగుచున్నవి దెలిపెదనూ! 2

సకలప్రాణులకు పూర్వజన్మమున సంస్కారముతో గూడిన యా
అంతఃకరణము ననుసరించియును యా శ్రద్ధము గలుగుచు నుండున్!
వారివారి గుణ సంస్కారంబుల వర్తిలు చుండును గర్మలునూ!
పుణ్యాపాపములు, శుభాశుభంబులు బొలుపుగ గలుగును నారీతిన్! 3

సాత్త్వికులును దేవతల భజింతురు శ్రద్ధాభక్తుల గూడికొనీ!
రజోగుణము గలవారు గొలిచెదరు రాక్షసులను మఱి యక్షులనూ!
తమోగుణము గలవారు గొలిచెదరు దగ భూతంబుల బ్రేతలన్!
ఏ విధముగ బూజింతురు వారలు నింపుగ వారల సంస్కృతినీ! 4

అశాస్త్ర విహితము ఘోరమైనదియు నాడంబరమును గూడికొనీ
అహంకార సంయుక్త మైనదియు నలకామంబును గూడినదీ!
రాగబలంబును బశుబలయుక్తము రమ్య పంచభూతములనూ!
ఇంద్రియముల శుష్కింపజేయుచును నీశ్వరుండగు నను గూడన్
అంతర్యామిగ నున్న నను జనులు వింతగ కష్టము బెట్టుచునూ
రహి యవివేకులు, నజ్ఞానులు మఱి రయముగ తమకును నితరులకున్!
బాధాకరమగునట్టి శ్రద్ధతో బన్నుగ భక్తి నిజేయుదురూ!
అసుర స్వభావము గలవారినిగా నలరి దెలియుమూ! వారలనూ! 5-6

## ఆహారము మూడు విధములు

ఆహారము గూడను సర్వులకును నలరి మూడు విధములు ప్రీతిన్
అగుచున్నది పార్థా! యా విధమున నల యజ్ఞ స్తప దానములున్
మూడు విధములను ప్రియమై యుండును మోదమలర యా జనములకున్
వాని భేదముల వివరించెదనూ వినయశీల! వినుమా వానిన్! 7

ఆయు స్సత్త్వ బలారోగ్యంబుల బన్నుగ సౌఖ్యము ప్రీతులనూ
వృద్ధి జేయునవి రసము గలవియును విమలములైనవి స్నిగ్ధములున్!
స్థిరములు, హృద్యాహారంబులు మఱి శీలత సాత్త్వికులకు ప్రియమున్!
ఆ యా కాలములందు ఫలించెడి నా యా ఫల మూలంబులునూ! 8

చేదు, పులుపు, నుప్పన, కారంబును జెన్నుగ మిక్కిలి వేడిగనూ!
చమురు లేనివియు, నధిక దాహమును, సహజముగా గలిగించుననీ!
దేహమునకు దుఃఖము గలిగించుచు దీరుగ మనసుకు వ్యాకులతన్!
గలుగజేయునవి రాజస గుణులకు గడు నిష్టములై యుండు నికన్! 9

వండిన పిమ్మట జాము దాటినవి నిండుసారమును బోయినదీ!
దుర్గంధంబును, బాచిపోయినది యొరులు దినగ మిగిలినదియునూ!
శుద్ధి గానిదియు, భగవంతునకును సురుచిరముగ నర్పింపనిదీ!
తమోగుణము గలవారికి యిష్టము దగ భుజియింతురు ప్రీతిగనూ! 10

## త్రివిధములగు యజ్ఞములు

"ఈ కార్యము జేయగ దగినది" యని యింపుగ మది యాలోచించీ
ఫలాపేక్ష లేకను నా ఫలమును భగవంతునకు ను నర్పించీ
శాస్త్ర సమ్మతంబగు నే యజ్ఞము సరసత జేయుదురో పార్థా!
సాత్త్విక యజ్ఞంబనబడు అర్జున! సత్కర్మల శాస్త్రంబులనూ! 11
భరతవంశమున శ్రేష్ఠుండవు నగు పార్థా విను! నే దెలుపునదీ!
ఫలమును గోరుచు జేయబడెడి యా బహు యజ్ఞంబులు కర్మలునూ!
ఆడంబరమున జేయబడెడి యా నలరు బూజలును కర్మలునూ
రాజస యజ్ఞములని దలంపుమా! రమ్య శీల? నే దెలుపునదీ! 12
అర్జున! విధిహీనం బైనదియును అన్నదానమును లేనిదియున్!
మంత్రహీనమైనదియును పార్థా! మఱి దక్షిణయును లేనిదియున్!
శ్రద్ధా విరహిత మగు యజ్ఞంబును సరసత దామస యజ్ఞమనీ
తెలుపగబడినది శాస్త్రములందున దీరుగ తామస యజ్ఞమునూ! 13

## త్రివిధములగు దపస్సులు

అర్జున! దేవ ద్విజ గురు ప్రాజ్ఞుల యలరి భక్తి సేవించుటయున్!
బాహ్యాభ్యంతర శుద్ధి గలుగుటయు బన్నుగ ఋజుత్వమున నుండీ!
బ్రహ్మ చర్యమును, నహింస దోడుత బరగ నిష్ఠతో నుండుటయున్!
శారీరకమగు దపసటంచునూ శాస్త్రములందున దెలుపబడెన్! 14
పరుల మనసు నొవ్వగ జేయనిదీ బన్నుగ సత్యంబైనదియున్!
ప్రియకరమైనది పరునకు మిక్కిలి ప్రీతి, మేలు గలిగించునదియున్!
వేదాధ్యయనము నభ్యసించుటయు వివిధ గ్రంథ పఠనంబులునూ!
వాచిక దపమని దెలిపిరి బుధులును వలనొప్పగ శాస్త్రము లందున్! 15
మనసును ప్రసాదమును నుంచుటయును మానుగ సౌమ్యత్వము నుంటన్
మౌనంబును మఱి యాత్మ నిగ్రహము మధురభావ సంశుద్ధియునూ!
పరమాత్మను గూర్చిన ధ్యానంబున బన్నుగ యుండుట కౌంతేయా!
మానసికమగు దపమనుచు నార్యులును మానుగ దెలిపిరి ధనంజయా! 16

ఫలాపేక్ష యది లేని వారలును బన్నుగ నిశ్చల చిత్తులునూ!
అట్టి జనులచే నధిక శ్రద్ధచే నాచరింపబడు దపంబునూ!
శారీరక, వాచక, మానసికమును సరసరీతి పై దెలిపినవీ
మూడు విధములగు నా దపస్సునూ మునులు సాత్త్వికం బని యనిరీ! 17
ఇతరులచే సత్కారము నొందగ యితరుల గౌరవ మందగనూ!
ఇతరుల బూజల నందగోరుచును నింపుగ దంబముతోగూడీ!
చేయబడెడి యా తపస్సు భార్థా! స్థిరముగానిదియు నధ్రువమున్!
అట్టి ఫలంబును గలదై జగతిని యల రాజస దప మనిరి బుధుల్! 18
మూర్ఖపు శఠమున దమ శరీరముల మొరటుగ బాధల ముంచుచునూ!
పరుల నాశమును జేయగోరుచును బరుల నహితమును మదిగోరీ!
చేయబడెడి యా దపసు బాండవా! చీకటి తెరలను గల్పించున్!
ఆ తపస్సు దామసిక దపస్సని నలరుచు దెలిపిరి బండితులున్! 19
"ఈయ వలసినది" యను నిశ్చయమున యేదానము జేయగ బడునో!
పుణ్య ప్రదేశము బుణ్యకాలమున బూజ్యుడునగు వానికి మఱియున్!
ప్రత్యుపకారము జేయగలేనీ బరగ శక్తి హీనునికి దగన్!
జేయబడెడి యాదానంబును సఖ! స్థిరముగ సాత్త్విక దానమనీ
తెలుపగబడె శాస్త్రముల నర్జునా! దీరుగ కర్మిష్ఠుల జేతన్! 20
ప్రత్యుపకారార్థము లేదా మఱి బన్నుగ ఫల ముద్దేశించీ
మనస్సు గలతను, నతి కష్టముతో మానుగ జేసెడి దానంబున్!
రాజస దానంబనుచు బలికిరీ రాజఋషులు శాస్త్రము లందున్!
తదుపరి దెలిపెద దామస దానము విదితముగా నర్జున! వినుమా! 21
అపవిత్రమునగు బ్రదేశ మందున నపవిత్రములగు కాలములన్!
అపాత్రులగు వారలకు నర్జునా! యనర్హులగు వారలకు మఱిన్!
అసత్కృతముగా నవజ్ఞాతముగ యలరి జేసెడీ దానములున్!
దామస దానం బనుచును దెలిపిరి దగ శాస్త్రము లందున నార్యుల్! 22
"ఓమ్" "తత్" "సత్" యను మూడు విధములగు ముదమున బ్రహ్మము-
నకు బేరుల్
నిర్దేశించిరి పెద్దలు భారత! నిర్మల మతితో యానాడున్!

ఈనామత్రయమును జేకొనియే నిర్మలమతులగు జ్ఞానులచే
వేదంబుల, యజ్ఞముల శాస్త్రముల విదితముగా నిర్మింపబడెన్! 23
అందువలన వేదముల నెఱింగిన బ్రహ్మవాదినుల శాస్త్రములన్
యజ్ఞదాన తప క్రియలన్నియునూ నలరుచుండు నోంకారముతో!
"ఓమ్" యనుచును ముందగ జెప్పుదురూ నొప్పుగ యా పిమ్మట బార్థా!
సకల కర్మలును యనుష్టింపబడు సవ్యసాచి! వినుమా మఱియున్! 24
ఆ విధముగ "తత్"యను బదంబునూ యలరి బలుకుదురు ముముక్షువుల్
ఫలాపేక్షలేకయు బహు కర్మలు బన్నుగ జేయుచు నుండెదరూ!
యజ్ఞ దాన తప కర్మలజేయుచు యజ్ఞానంబును దాటెదరూ!
మోక్షకాము లీ విధమున జేయుచు ముదమున నను బొందెదరుసుమా! 25
కలదు యనెడి యర్థంబున మఱియును "గడుమంచిది" యను నర్థమునన్!
సత్ యను నీ పరబ్రహ్మ వాచకము సరసముగా బలుకంగబడున్!
ఆ విధముగ యుత్తమ కార్యములను నల "సత్" యను నా పదంబునూ
వాడబడుచున్నది కౌంతేయా! వరుసగ "ఓమ్" "తత్" సత్తులనూ! 26
తపస్సునందును, యజ్ఞమునందును దానమునందును గలనిష్టన్!
"సత్" అనియే జెప్పగబడుచున్నది సావధానముగ విను! బార్థా
బ్రహ్మోద్దేశములైన కర్మలును భగవత్ప్రీత్యర్థములైనా
కర్మలుగూడను నీతో శబ్దముచే గూర్మిని బిలువగ బడుచుండున్! 27
అశ్రద్ధ తోడుత జేయుకర్మలును అర్జున వినుమా! కడుశ్రద్ధన్
హోమముగానీ, దానముగానీ, విమలమైన దపమునుగానీ!
"అసత్తు" ననుచును జెప్పబడును సుమ! యల శాస్త్రంబుల నార్యులచే
ఇహపరలోకంబుల ఫలంబులను నింపుగనీయవు గౌంతేయా!
"శ్రద్ధాత్రయమగు విభాగయోగము శ్రద్ధాన్వితుడగు నర్జునుకున్!
భగవానుండగు వాసుదేవుడును బన్నుగ యావిధమున దెలిపెన్!
అనుచు దెలిపె ధృతరాష్ట్ర విభునకును నలరి సంజయుడు మోదమునన్!
దాను వినిన గాంచిన విషయములను దగ ముత్తియములును బేర్చినటుల్!

(శ్రద్ధాత్రయావిభాగయోగము సమాప్తము)

ఓం

# శ్రీ భగవద్గీత

# మోక్ష సన్న్యాస యోగము

## పదునెనిమిదవ అధ్యాయము

కేశి రాక్షసుని దునిమిన వాడా! కృష్ణా! దెలుపుము విశదముగా
సన్న్యాసమునకును ద్యాగంబునకును సహజముగా గల భేదంబున్!
తత్త్వంబుననే తెలియ గోరెదను దగ బాపుము! సదేహంబున్!
ఆరెండింటిని వేఱువేఱుగా నలరి దెలుపుమా! గోవిందా! 1

భగవానుండగు కృష్ణుడు పలికెను బార్థునితో మృదువాక్యములన్!
సన్న్యాసమునకును ద్యాగంబునకును సవ్యసాచి! విను! దెలిపెదసూ!
కామ్యకర్మలను బరిత్యజించుట విమలమైన సన్యాసమనీ!
కొందఱు బండితులును దెలిపిరీ కూరిమి దమ దమ శాస్త్రములన్ 2

అర్జును డిటులను ఇలికె కృష్ణుతో నంజలి ఘటించి వినయమునన్!
మఱికొందఱు విజ్ఞులు బలికి రిటుల్ భూనుగ స్పష్టాక్షరములనూ!
సర్వకర్మలను బరిత్యజించుట సరసరీతి ద్యాగం బనిరీ! 3
బుద్ధిమంతులగు వారలు గొందఱు బురుషుడు దోషంబునకు మఱెన్!
కర్మములను ద్యజియింపవలయునని కంఠోక్తిగ దెలిపిరి బార్థా!
యజ్ఞ దాన తపః కర్మంబులనూ యలరి విడువరాదనియు మఱిన్
గొందఱు ప్రాజ్ఞులు దెలిపిరి యర్జున! కూరిమి లోకంబునకు వారున్! 3
కర్మత్యాగ విషయంబున యర్జున! గల మది నిశ్చయమును నేనున్!
తెలియజేసెదను విశదముగా విను! వికలముజెందకు మది యందున్!
భరతకులోత్తమ! పురుషశ్రేష్ఠుడ! బన్నుగ పూర్వులు దెలిపిరిగా
త్యాగంబనునది మూడువిధములని దగ దెలియుము ముందుగ బార్థా! 4

యజ్ఞ దాన దప కర్మంబులునూ యలరి విడువరా దెన్నడునూ !
అట్టి కర్మలను జేయగ వలయును యిష్టరీతి శ్రద్ధాభక్తిన్ !
యజ్ఞ దాన తప జప సత్కర్మలు నలరి మనీషుల నెల్లపుడున్
పావనంబు జేయును గద ! యర్జున బన్నుగ వానిని జేయవలెన్! 5

అట్టి కర్మలను గూడ అర్జునా ! యలరి యజ్ఞ తప దానములన్
ఆసక్తిని ఫలముల ద్యజియించీ యనుసరింపవలె దృఢభక్తిన్ !
నా నిశ్చయమిది యభిప్రాయమిదె యనుసరింపు నీవును గూడన్ !
కర్మఫలంబును ద్యజియించుటయే కాంక్షింపుము నీ వెల్లపుడున్ ! 6

వేదశాస్త్రముల విధింపబడినా వివిధ కర్మలను గౌంతేయా !
పరిత్యజించుట దగదుసుమా ! మఱి పావనమగు నా కర్మలనూ !
వేదకర్మలను నెవ్వడైననూ విడిచినచో నా త్యాగమునూ !
తామస త్యాగంబని నార్యులచే దగ జెప్పగ బడుచున్నదిగా! 7

శరీరకష్టం బని మది దలచుచు సవ్యసాచి ! దుఃఖంబనుచున్ !
బరిత్యజించుట దగదు సుమా ! మఱి పావనమగు నా కర్మలనూ !
వేదకర్మలను నెవ్వడైననూ విడిచినచో నా త్యాగమునూ !
తామస త్యాగంబని యార్యులచే దగ జెప్పగబడు చున్నదిగా ! 8

ఈ కార్యము జేయగ దగునంచును నిల శాస్త్రములను జెప్పినదీ !
ఏ కర్మము నభిమానము గర్వము నిమ్మగ ఫలమును ద్యజియించీ !
జేయబడుచు నున్నదో కౌంతేయా ! శ్రీకరమగు నా త్యాగమునూ !
సాత్త్విక త్యాగంబని బలికిరి గద ! శాస్త్రములందున యాచార్యుల్ ! 9

సత్త్వ గుణముతో గూడినవాడును, సంశయమును విడిచినవాడున్,
ప్రజ్ఞాశాలియు, ద్యాగశీలుడును బన్నుగ శాంత స్వభావుండున్ !
అశుభంబును, కామ్యమును, దుఃఖమును నట్టికర్మ ద్వేషింపడుగా
శుభమును, మఱి నిష్కామంబును నగు సుఖకరములునగు గర్మములన్
ఆసక్తిని గనుపరుపడు అర్జున ! యభిమానంబును దెలుపడుగా ! 10

దేహధారియగు జీవుని కిలలో దీరుగ కర్మలు జేయుటయున్ !
జరుగుచుండు కర్మముల బూర్తిగా సాధ్యము గాదుగ విడుచుటయున్ !
ఎవడు కర్మఫలములను విడుచునో యెవడు విడుచునో సంగమమున్ !
అట్టివాడు 'త్యాగి'యని పెద్దలు గట్టిగ దెలిపిరి శాస్త్రములన్ ! 11

దుఃఖకరము, సుఖకరమైనదియును, దుఃఖ సుఖములవి రెండు నిలన్ !
గలిసినదియునగు మూడు విధములగు గర్మఫలంబులు గౌంతేయా !
కర్మఫలము ద్యజియింపని వారికి గలుగుచుండు మరణము బిదపన్ !
త్యాగము జేసినవారి కన్నచో గలుగనేరవవి యెన్నటికిన్ ! 12

అర్జున వినుమా ! సమస్త కర్మలు నలరి యిలను నెరవేరుటకున్ !
కర్మకాండ యంతమును దెలుపునది కమనీయంబుగు సాంఖ్యమునన్ !
దెలుపబడెను కారణము లైదునవి దీరుగ దెలిపెద వివరముగా
తెలిసికొనుము ! అర్జున ! నా వలనను దీరుగ నొక్కొక్కటి శ్రద్ధన్ 13

కర్మాచరణమునందు అర్జునా ! కారణములుగా నివి యుండున్ !
ఒకటి శరీరము రెండు కర్త మఱి యొనరగ మూడవ దింద్రియముల్ !
పలువిధములు నగు వ్యాపారంబులు, బరగ వేఱు క్రియలును నాల్గున్ !
ఐదవదియునగు దైవంబును మఱి యలరి యుండు గారణములుగాన్ ! 14

మనుజుడు, శరీరమున వాక్కున మఱి మనసున జేసెడి కర్మలనూ !
న్యాయమైన, యన్యాయమైననూ ! నయముగ జేయునా కర్మలనూ !
వాని కన్నిటికి బైని జెప్పినా వరుసగ యైదును గారణముల్
శరీరంబు, గర్తయు, నింద్రియములు సవ్యసాచి ! క్రియ నీశ్వరుడున్! 15

కర్మ విషయమున పైని జెప్పినా గతి యైదును గారణముండన్ !
ఏ మనుజుడు సంస్కృతిని బొందనీ యిల నల్ప బుద్ధి గలవాడై
నిరుపాధికుడగు నాత్మను గర్తగ నిశ్చయించు నవివేకి మఱిన్ !
కర్మ యాత్మలా నిజస్వరూపము మర్మమెఱుగ కున్నాడు నిలన్ ! 16

ఏ పురుషునకుఁ 'నేను' కర్త నను నిచ్ఛా దలంపులును లేవో !
బుద్ధి-విషయముల కర్మల నంటదొ యతఁడీ ప్రాణుల నన్నిటినీ !
చంపిన గూడను వాస్తవరీతిని చంపుట లేదిఁదెవ్వరినీ !
పాపము జేతను, కర్మల జేతను బంధింపగ బడుటయు లేదూ ! 17

కర్మమునకు హేతువు జ్ఞానంబును! గడు దెలియగదగ వస్తువునూ;
తెలియువాడునని మూడు విధములుగ దీరుగ నున్నది శాస్త్రములన్ !
అటులే కర్మకు నాధారంబును ఉపకరణము, క్రియ కర్తయునూ !
మూడువిధములుగ దెలుపబడినదీ మునులచేత శాస్త్రములందున్ ! 18

గుణవిచారణము జేయు సాంఖ్యమున కూర్మిని జ్ఞానము కర్మలనూ !
కర్తయనునవియు గుణభేదములను గడగి త్రివిధముల దెలుపబడెన్ !
వానిని గూడను యధారీతినీ వరుసగ శాస్త్రోక్తము రీతిన్ !
వినుమా ! అర్జున ! దెలియ జెప్పెదను విమలవాక్యముల నిటుమీదన్! 19

త్రివిధములగు జ్ఞానము

విభజింపగబడి వేఱువేఱుగను విమల చరాచర భూతములన్ !
ఒక్కటియగు నా యాత్మ వస్తువును ఒక్కటిగా గాంచునొ యతడున్ !
విజ్ఞానముచే నెఱుగుచుండెనో యేకముగా దైవము యునికిన్ !
అట్టి జ్ఞానమును సాత్త్వికంబనుచు నలరి దెలియుమా ! కౌంతేయా ! 20

ఏ జ్ఞానంబున బురుషుడు జగతిని యిమ్ముగ సమస్త భూతములన్ !
వేఱువేఱు విధములుగా నుండిన వివిధ జీవులను వేర్వేఱన్ !
భావించుచునున్నాదో నాతడు భ్రమయందున దా జిక్కుకొనున్ !
అట్టి జ్ఞానమును రాజస జ్ఞానము నందురు దెలియుము గౌంతేయా ! 21

ఏ జ్ఞానంబును బురుషుడు మదిలో యేదే నొక పనియందుననూ !
సమస్తమును యదియేయని దలచునొ సకల శరీరము లందుననూ !
తగిన కారణంబుందదొ మరియును దత్త్వంబును దెలియక యుండున్ !
అల్పమైనదిగ యల్పఫలంబును నలరి యుండునదిగా నుండున్ !
అట్టి జ్ఞానమును దామసజ్ఞానము యనియందురు బ్రాజ్ఞులు బార్థా ! 22

### త్రివిధములగు కర్మలు

శాస్త్రముచే నియమింప బడినదియు సరస ఫలాపేక్షయు లేకన్ !
ఆసక్తియు, అభిమానముగానీ, యలరి రాగ ద్వేషంబులునూ !
లేకుండగ జేయగబడునది సుమ ! లీలగ సత్పురుషుల చేతన్ !
అట్టి కర్మమే సాత్త్వికకర్మము గట్టిగ తెలియుము గౌంతేయా ! 23

ఫలాపేక్ష గలవానిచేత మరి బటు సాహంకారము తోడన్ !
బహుప్రయాసమును దోడ గూడినది బహు నాయాసము నైనదియున్ !
కర్మమేది చేయగబడు జగతిని మర్మముగా నుందురు లోకుల్ !
రాజస కర్మంబనుచు జగతినీ రమ్యముగా దెలిపిరి యార్యుల్ ! 24

మున్ముందున జరిగెడి యపాయమును ముందు జరిగెడీ కష్టములున్ !
తనకు నితరులకు గలిగెడి బాధను దన పౌరుషమును దెలియకనూ !
అవివేకముతో ప్రారంభించెడి యట్టికర్మలను గౌంతేయా !
దామస కర్మములని దెలుపగబడె దగ శాస్త్రములను నార్యులచే ! 25

### త్రివిధములగు కర్త

ముక్తసంగుడును, పలాపేక్షయును మోదముతో విడిచిన వాడున్!
'నేను కర్త'నను నహంభావమును నిరతము విడిచినవాడు నిలన్!
కార్య కార్యములందు వికారత గలుగని వాడును గౌంతేయా!
ధృత్యుత్సాహ సమన్వితుండునూ ధృతి జెడకుండిన వాడు నిలన్!
సాత్త్విక కర్త యటంచును నార్యులు సరసత దెలిపిరి శాస్త్రములన్! 26

అనురాగము గలవాడును అర్జున ! యలరి కర్మఫలముల యందున్!
ఆశించెడివాడును మఱి లోభియు నలహింసాత్మకుడును మఱియున్
కార్యములందున సుఖదుఃఖంబులు గడు రక్తిని గలిగిన వాడున్!
అతనిని రాజస కర్తయందురని యలరి బుధులు దెలిపిరి బార్థా! 27

అయుక్తుండు మఱి ప్రాకృతుండునూ నలరి స్తబ్ధుడును శఠుండునూ!
అలసుండును మఱి వంచకుండునూ! యతి దుఃఖితుడును నగువాడున్!

కార్యములను సంపూర్తి జేయుటను గడు నుపేక్షితుడు నగువాడున్!
అట్టివాని దామస కర్తనుగా నలరి దెలిపిరీ శాస్త్రములన్! 28

## త్రి విధములగు బుద్ధి

బుద్ధియందు మఱి ధైర్యమునందును భేదము గుణములతో గూడి!
మూడు విధములుగ దెలిపిరి పెద్దలు మోదముతో వేర్వేరుగనూ!
సంపూర్ణముగా దెలుపబడెడి యా నింపుగ యార్యులు దెలిపినదీ!
దెలుపుచుంటి వినుమా కౌంతేయా ! తేటతెల్లముగ నేనిపుడున్! 29
ప్రవృత్తియందును, నివృత్తి యందును బన్నుగ కార్యా కార్యములన్
భయా భయంబుల బరంతపా విను! బంధ మోక్షముల యందుననూ
కడుశ్రద్ధను గని దెలియుచున్నదో కడురమ్యములగు విషయములన్!
అట్టిబుద్ధి సాత్త్వికమైనదనీ యలరి దెలిపిరీ ధర్మజ్ఞుల్! 30

ఏ బుద్ధిని మనుజుండు ధర్మమును, నిమ్ముగ యధర్మమును గూడన్:
జేయదగినదానిని మఱి యర్జున! జేయదగని దానిని గూడన్!
ఉన్నది యున్నటు లను గాకను మరి యున్నది వేఱొక విధముననూ!
తెలిసికొనునా యా బుద్ధిని దెలిపిరి దీరుగ రాజస మని యనుచున్! 31

అవివేకముచే గన్ను కప్పబడి యధర్మమును ధర్మం బనుచున్!
నెంచుచుండునో సకల వస్తువుల యెంచునా విపరీతంబులుగా!
విరుద్ధములుగా మదిలో దలచుచు వికలత జెందుచు నుండెడినో!
అట్టి బుద్ధి తామస బుద్ధి యనీ యందురు నార్యులు శాస్త్రములన్! 32

## త్రివిధములగు ధైర్యము

విషయము లందున బ్రవర్తింపకను వివేక పూరిత ధైర్యమునన్!
మనసు, ప్రాణమును, నింద్రియములనూ మహాయోగ సాధనచేతన్
విషయజాలములనుండి క్రియలనూ! వెనుకకు ద్రిప్పుచు నిశ్చలతన్!
ఆత్మధ్యానమున శాస్త్రోక్తముగా నలరి నిలువ బెట్టుచు నుండున్!
అట్టి ధైర్యమే సాత్త్విక మైనది యలరి వినుము! ఓ కౌంతేయా! 33

ఫలాపేక్షగలవాడై మనుజుడు బరగ ధర్మమును నర్థమునూ
కామంబును మిక్కిలి యాసక్తిని గడగి యాచరించునో వాడున్!
ఏ ధర్మముననను మనుజుడు లోబడి నిష్టకార్యముల వర్తించున్!
అట్టి ధైర్యమును రాజసంబనియు నలరి దెలియుమా! పరంతపా! 34

ఎట్టి బుద్ధిచే దుర్బుద్ధియునగు దుష్టుడైన యా పురుషుండున్!
నిద్రను, భయమును శోకంబును మరి నిర్మల భావము లేకయునూ
సంతాపంబును, దగులును, మదమును, సహజముగా విడువక యుండున్!
అట్టి ధైర్యముదు దామస మనుచును నలరి దెలియుమా! బరంతపా! 35

## త్రివిధములగు సుఖములు

భరతర్షభ! విను నే దెలుపునదీ బన్నుగ యాసక్తిని గూడీ!
దేనియొక్క యభ్యాసము పురుషుడు దీరుగ యానందము నొందున్!
దుఃఖాంతంబును బొందు చుండునో దురంతమగు నీ లోకమునన్!
అట్టి సుఖము మూడైన విధములను నిష్టముగా దెలిపెద నిపుదున్! 36

ప్రారంభము నందుననను విషము వలె బన్నుగ పరిణామము నందున్!
అమృతంబు బోలినదిగ యుండునూ నర్జున! వినుమా నిశ్చలతన్!
ఆత్మ బుద్ధి నిర్మలతను బొందును అట్టి సుఖమునే కౌంతేయా!
సాత్త్విక సుఖమని దెలియుము దీనిని సర్వోన్నత మని దెలుపబడెన్! 37

విషయేంద్రియ సంబంధము వలనను విమలామృతమును బోలియునూ!
మొదట దోచు! బర్యవసానంబున మొరటుగ దోచును విషమువలెన్!
అట్టి సుఖము రాజనమని దెలిపిరి అలరి శాస్త్రముల బండితులున్!
నీవును దెలియుము త్రివిధ సుఖంబుల నిర్మలమతి తద్భేదములన్! 38

నిద్రాలస్యము, ప్రమత్తతను మరి నిలయమెనదియును బరంతపా!
ఏ సుఖంబు ప్రారంభమునందున యిమ్ముగ యంతము నందుననూ!
మోహము, నజ్ఞానంబు, భ్రమయునూ, మొరటుగ జేయుచు నుండెడినో
అది దామస సుఖమనుచు దెలిపిరీ యార్యులు శాస్త్రములందుననూ!

ప్రకృతి మాయచే నుద్భవించినా బన్నుగ మూడగు గుణములతో!
గూడియుండనీ వస్తువేదియును గూరిమి భూతములందుననూ!
దేవలోకమున భూలోకంబున దేవతలందున లేరు మరిన్!
సత్త్వరజస్తమ గుణముల గూడని వస్తువేదియును లేదిలనూ! 40

వ ర్ణ వి భ జ న

పరంతపా! విను! బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులగు వారలకున్
జన్మాంతర సంస్కారము వలనను స్వభావమున బుట్టిన గుణముల్!
అనుసరించి వారల కర్మములను నలరి వేఱు వేఱగు విధముల్!
విభజనమును గావింప బడినదీ! వినుము! వారి వృత్తులను మరిన్! 41

శమ దమంబులును, దపము, శుచిత్వము శాంతి, మరియు ఋజువర్తనమున్
శాస్త్రజ్ఞానము, అనుభవజ్ఞానము సర్వేశ్వరుపై భక్తియునూ!
గురువునందు, శాస్త్రములందునూ కూరిమి నమ్మక ముంచుటయున్
బన్నుగ స్వభావమున వికసించిన బ్రాహ్మణ కర్మగ దెలుపబడెన్! 42

శౌర్యతేజములు, ధృతి, సామర్థ్యము సాహసమును మది వీడకయున్!
యుద్ధమునందున వెన్ను జూపకయు యుద్ధరిత్రి బాలించుటయున్!
ప్రజాపాలనాశక్తియు, దానము బ్రజారంజనము జేయుటయున్
ఇయ్యవి స్వభావమునను జనించిన యిమ్ముగ క్షత్రియ కర్మమనీ
తెలుపబడెను శాస్త్రముల నర్జునా! దీదుగ క్షత్రియ ధర్మంబున్! 43

కృషి, గోరక్షణ, వాణిజ్యంబును విశదముగా నిల వైశ్యునకున్!
స్వభావ జనితములగు కర్మలుగా సరసముగా నిల దెలుపబడెన్!
ఆ విధముగనే సేవా రూపం బగు కర్మంబును శూద్రునకున్!
స్వభావ సిద్ధంబై యున్నది సుమ! సహజముగా సంస్కారమునన్! 44
శమ దమ కర్మల యందున శ్రద్ధయు దగ యాసక్తియు గల పురుషుల్!
జ్ఞాన యోగ్యతా రూపసిద్ధినీ యనయముగా బొందును బార్థా!
స్వకీయ కర్మల నాసక్తియు గల సరస గుణాఢ్యుడు దాసిద్ధిన్!
ఎట్లు బడయగలుగునొ తెలిపెద విను! నిమ్ముగ శ్రద్ధా భక్తులనూ! 45

ఎవనివలన ప్రాణుల కుత్పత్తియు నిరువుగ ప్రకృతి గుణములునూ!
యేర్పడు చున్నవా యెవనిచేత నీ సర్వజగము వ్యాపింప బడెన్!
ఆ పరమాత్మను స్వకీయ కర్మను నారాధించుచు బురుషుండున్!
జ్ఞానయోగ్యతా రూప సిద్ధినీ దాను బొందు చున్నాడు నిలన్! 46

గుణము గలిగినా తన ధర్మంబును గుణము లేనిదిగ కనబడినన్!
ఇతర ధర్మముల కంటెను అర్జున! నిమ్ముగ శ్రేష్ఠంబది యగునూ!
తన ధర్మమునకు దగిన కర్మమును దగ జేయుచు నుండిన యెడలన్!
మనుజుడు కిల్బిష మందగ నేరడు మానుగ వినుమా బరంతపా! 47

స్వభావ సిద్ధంబగు కర్మంబును సవ్యసాచి దోషంబైనన్!
దృశ్య రూపమైనను గౌంతేయా! దీరుగ త్రిగుణాత్మక మైనన్!
వదలగరాదు గదా కౌంతేయా! వాసిగ యగ్నియు ధూమముచే
గప్పబడిన విధి సమస్త కర్మలు స్పష్టముగా యాద్రిగణములన్!
దోషము జేతను గప్పబడెను గద దోషము నంటదు వారలకున్! 48

తగ సమస్త విషయంబుల యందున దగులుబాటు నొందని బుద్ధిన్!
గలవాడును మఱి జితాత్ముండునూ విగత స్పృహలుండును నగువాడున్!
సంగ త్యాగమున జ్ఞాన మార్గమున సర్వోత్కృష్టము నగునట్టి
మనుజుడు నిష్క్రియ యాత్మస్థితినీ మానుగ బొందుచు నున్నాడున్! 49

కర్మసిద్ధినీ బడిసిన మనుజుడు మర్మముగా నా పరమాత్మన్!
ఏ ప్రకారమున నందగలుగునో యా ప్రకారమును దెలిపెదనూ!
జ్ఞానము నందున శ్రేష్ఠనిష్ఠయును జ్ఞానము బర్యవసానంబున్!
జ్ఞాన పరాకాష్ఠను క్లుప్తముగా వినయ శీల! దెలియుము నాచేన్! 50

విశుద్ధ మగు బుద్ధియు గలవాడును విమల ధైర్యమున దన మదినీ
నిగ్రహించువాడును శబ్దాదుల నిరోధించు నా పురుషుండున్
రాగద్వేషములను ద్యజించుచును రమ్యముగా నేకాంతమునన్
నివసించెడువాడును బరంతపా! నిర్మల మోక్షము నందు సుమా! 51

మితాహారమును భుజించు వాడును మేలుగ వాక్కును శరీరమున్!
మనస్సు స్వాధీనమున నుంచుకొని మానసికముగ దా నెల్లపుడున్!
ధ్యానయోగ తత్పరుడై మెలగుచు వినయము వైరాగ్యంబులనూ!
అవలంబించెడు వాడు అర్జునా! యలరి మోక్షమును నందు సుమా! 52

అహంకార బల దర్పంబులనూ అల కామము క్రోధంబులనూ!
వస్తు సంగ్రహంబును బాగుగనూ వదిలి వైచు నాపురుషుండున్!
మమకారంబును లేనివాడునై మధుర శాంత భావము తోడన్
నుండెడివాడును బ్రహ్మ స్వరూపము నొందుటకును మఱి సమర్థుడున్! 53

బ్రహ్మ స్వరూపము బొందిన వాడును ప్రశాంత చిత్తుండగు వాడున్!
దేనిని గూర్చియు దుఃఖింపడు మఱి దేనిని గాంక్షింపడు మదినీ!
సమస్త భూతములందును ప్రేమను సమబుద్ధియు గలిగినవాడై
మద్భక్తిని శ్రద్ధను గౌంతేయా! మానుగ బొందును మోక్షంబున్! 54

భక్తిచేత నేనెంతటి వాడనొ బరగ నెట్టివాడను నేనున్!
యదార్థముగ నిజభక్తుడు దనలో నరసి దెలిసి కొనుచున్నాడున్!
ఆ విధముగ ననుగూర్చి దెలిసికొని నలరుచు వాస్తవముగా నెఱిగి!
అనంతరము నా పురుషుడు నాలో నంతర్భూతము నగును సుమా! 55

సర్వకర్మలను సదా మనుజుడును సతతము జేయుచు నుండిననూ!
నన్నే యాశ్రయ మందువాడునూ నను శరణము నందెడువాడున్!
నా యనుగ్రహము నందుచు భక్తుడు నాశరహితమగు మోక్షంబున్!
బొందుచుండు వినుమా! కౌంతేయా! కందడు జన్మ పరంపరలో! 56

అర్జునుని సంబోధించి

సమస్త కర్మల కర్మఫలంబును సతతము వివేక మగుబుద్ధిన్!
నాయందున యర్పించి పాండవా! నన్నే పరమముగా నెంచీ!
దగ చిత్తైకాగ్రత గూడికొనీ తత్త్వ విచారణలో మునిగి!
ధ్యాన యోగమున యెల్లప్పుడునూ దగ నిల్పుము నను చిత్తమునన్! 57

నాయందున చిత్తము నిలిపినచో నాయనుగ్రహము వలన నికన్!
సమస్త సంసారిక దుఃఖములను సరగున దాటెద వో పార్థా!
అటులగాక దురహంకారంబున నలరు నాదు నీ వాక్యములన్
మనసున వినకుండినచో భారత! మానుగ చెడిపోయెదవు సుమా! 58

ఒకవేళను నీ వహంకారమును నొప్పగ యవలంబించి మదిన్!
నేను యుద్ధమును జేయనటంచును నీమది దలంతువేని మఱిన్!
అట్టి నీదు యత్నంబు లన్నియును నిట్టె వ్యర్థమై దీరుగదా!
నీస్వభావమే నిన్ను యుద్ధమున నియమించును నిజముగపార్థా! 59

పూర్వజన్మ సంస్కారము జేతను బొలుపుగ నీదు స్వభావమునన్!
ప్రకృతి సిద్ధనుగు నీ కర్మలచే బహు విధముల బంధింపబడీ!
దేనిని చేయగ యవివేకంబున నిచ్చగింప కుంటివో దానిన్!
పరాధీనతను గర్మాధీనత బన్నుగ తప్పక జేయుదువూ! 60

జగన్నియామకుడగు నీశ్వరుడును సర్వాంతర్యామియునగు మఱియున్
మాయచేత సకల ప్రాణులనూ మానుగ కీల్బొమ్మలవలెనూ!
యంత్రము నారోహించిన వారిగ యంతరమున ద్రిప్పుచును మఱిన్!
సమస్త ప్రాణులయొక్క హృదయమున సహజముగా వెలయుచు నుండున్ 61

సర్వవిధములను హృదయస్థుండగు శరణు బొందు మా! యీశ్వరునీ!
ఆతని యనుగ్రహంబున గరుణను నా సర్వోత్తమ మగు శాంతిన్!
శాశ్వతంబునగు మోక్ష పదవినీ సహజముగా బొందెద నింకన్!
జన్మ పరంపరనుండి దప్పెదవు సర్వము హరికిని యర్పించీ! 62

గుహ్యాగుహ్యతరంబగు జ్ఞానము గూఢమైన యీ శాస్త్రంబున్!
ఈ విధమున నీ కుపదేశించితి యిల గీతా రహస్యంబున్!
దీని నంత బరిశీలన సేయుము దీరుగ మది యాలోచించీ!
తోచిన విధమున యాచరింపుమా! తోరముగా నెది యిష్టంబో! 63

రహస్యంబు లన్నిటిలో మిక్కిలి రహస్యమైనది శ్రేష్ఠంబున్!
నావాక్యంబును ఓ కౌంతేయా! నయముగ వినుమా! యేలయనన్!
నీవు నాకు మిక్కిలి యిష్టుండవు! నిజముగ యీ కారణముననూ!
మఱల దెలుపు చుంటిని విను మర్జున మానుగ నీహితమునఁగోరి! 64

నాయందున నీ మనస్సు నుంపుము! నను భక్తిని మది గలుగుచునూ!
నన్నారాధింపుము గుంతీసుత! నాకు జేయుమా నమస్కృతుల్!
అటుల నీవు గావించెదవేనీ నలరి నన్ను నందగగలవూ!
నాకిష్టుడవై యుంటివి కావున నయముగ సత్యము బలికితినీ! 65

సర్వధర్మముల బరిత్యజింపుము శరణు బొందుమా! నన్నొకనిన్!
సకలపాపములనుండి యర్జునా! సత్యము! నిను ముక్తునిజేతున్!
నీకు దెలిపినా గీతాశాస్త్రము నిర్మలమును మఱి పవిత్రమున్!
జన్మపరంపర దాటెద వర్జున! మర్మముగా నిది నావకదా! 66

నాభక్తుండును గాని వాడునూ! నాదపస్సు జేయని వాడున్!
నన్నువినని వాడును మఱి యర్జున! నయముగ శ్రీ గురుసేవయునూ
జేయనివాడను నను దూషించుచు జిత్తంబున మఱి యసూయయున్
గలిగినవానికి యీశాస్త్రంబును గడగి జెప్పగను రాదుసుమా! 67

ఈరహస్యమగు గీతాశాస్త్రము నిమ్ముగ నాభక్తుల కెపుడున్
బోధించుచు నుండునొ యా భక్తుడు బూర్తిగ నాయందున భక్తిన్
గలిగినవాడై సంశయ మంతయు గడమ లేక నిస్సంశయుడై
నిస్సందేహముగా నను బొందును నిర్మల హృదయుండై యతడున్! 68

అట్టివానికంటెను మనుజులలో నధిక ప్రియము జేసెడు వాడున్!
ఎవడునులేడుసుమా! కౌంతేయా! యిమ్ముగ సత్యము బలికితిన్!
అలరి వినుము! నా కతని కంటెనూ అతియిష్టుడు మఱి లేడుసుమా!
అతనికంటె ప్రియమైన వాడు మఱి యలరి యీభువిని లేడు సుమా! 69

ఎవడు ధర్మయుక్తంబగు మన యిరువురి నిమ్ముగ ధర్మ స్వరూపంబున్
చె సంభాషణమును నధ్యయనము నింపుగ జేయునొ గడుశ్రద్ధన్!
అట్టివానిచే జ్ఞాన యజ్ఞమున నారాధింపగ బడినట్టి
వాడనగుదునని యర్జున! వినుమా! వలనొప్పుగ నా నిశ్చయమున్! 70

ఏపురుషుడు శ్రద్ధను గూడికొని యిమ్ముగ యసూయలేకుండన్
ఈగీతాశాస్త్రంబును వినునో! యీ నా వచనములను వినునో!
పాపవిముక్తుడై యాతండును బరగ బుణ్య కార్యంబులనూ!
జేసిన వారల పుణ్యలోకముల జేరును నాతడు సత్యముగన్! 71

ఓ అర్జున! యీగీతా శాస్త్రము నొప్పుగ యేకాగ్రత దోడన్
వింటివ? మఱి యజ్ఞాన జనితమగు నీమది మోహము దొలగిదా?
నీమది సందేహములు దొలగెనా? నీ జ్ఞానము వికసించినదా?
భగవంతుండగు గృష్ణు డీ విధము బార్థునితో బలికెను బ్రీతిన్! 72

శ్రీకృష్ణుని బలుకులు వినిబార్థుడు స్థిరముగ బలికెను కృష్ణునితో
శ్రీకృష్ణా! నీయనుగ్రహంబున చిత్త శాంతి లభియించినదీ!
నాయజ్ఞానంబెల్ల నశించెను నాకు నాత్మస్మృతి గలిగినదీ!
సంశయములు దొలగెను మధుసూదన! సరసత జ్ఞానము గలగినదీ!
ఇక నెఱవేర్చెద! నీయాజ్ఞలనూ నిమ్ముగ కృతనిశ్చయమున నే!
అనుచు ధనుస్సును బాణంబులనూ అర్జునుండు జే ధరియించెన్! 73

సంజయు డిటులను గౌరవేంద్రుతో సరసత బలికెను వినయమునన్!
ఓధృతరాష్ట్ర మహీవల్లభ! విను! నొప్పుగ యీవిధమున నేనున్
మహాత్ములగు నా కృష్ణార్జునులా మానుగ పులకాంకితము నగూ!
ఆశ్చర్యకరంబగు సంభాషణ యలరి వింటి నేకురువర్యా!
మానవ జీవన మధుర లక్ష్యముల మఱి నే వింటిని ధన్యతనూ! 74

వేద వ్యాసుల ననుగ్రహంబున విమలమైన యాశాస్త్రమునూ!
గుహ్యమైనదియును పరమంబైనది కూరిమి మహాత్మ్య మైనదియున్!
యోగశాస్త్రమును యోగీశ్వరుడగు రాగరహితుడగు కృష్ణునిచే
అర్జునునకు బోధించుట వింటిని నలరుచు బ్రత్యక్షముగా నేనున్! 75

మహారాజ! ఓ ధృతరాష్ట్ర విభూ! మహాశ్చర్య కరమైనదియున్!
పావనమైనది పుణ్యదాయకము బవిత్రమైనది జగమునకున్!
శ్రీకృష్ణార్జున సంవాదంబును చిత్తమునందున దలచుచునూ!
మాటిమాటికిని యానందంబును మఱి నే బొందుచునున్నాడన్! 76

మేదిని వల్లభ! ధృతరాష్ట్ర విభూ! మిగులాశ్చర్యము నగునదియున్!
ఆ శ్రీకృష్ణుని యాత్మనాధునీ యలరు విశ్వరూపంబును నే
దలచి దలచి నా హృదయమునందున దగ మహదాశ్చర్యమునందీ
మాటిమాటికిని మనసున దలచును మఱి సంతసమందుచు నుంటిన్! 77

యోగీశ్వరుడగు శ్రీకృష్ణుండును దగ ధనుర్ధరుడు బార్థుండున్!
నెచటనుందురో శ్రీ సంపదయును నిమ్మగ విజయైశ్వర్యములున్!
దృఢమగు నీతియు నుండు నచ్చటను ధృతరాష్ట్రా! యిది నిశ్చయమున్!
నీకును నే వినిపించితి రాజా! నిర్మల గీతా శాస్త్రంబున్! 78

అనుచు బలికి ధృతరాష్ట్రుని తోడను ఆ సంజయుడును మధురముగా
కృష్ణార్జున సంవాదం బంతయు నిష్టముగా నతనికి దెలిపెన్!

